# జమీన్ రైతు

ESTD. 1930
Regd. No. H. NL. 18
సంపుటి: 59 సంచిక 34
26-8-1988
నెల్లూరు
శుక్రవారం
12 పేజీలు రూపాయి

స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు
మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి


# ఎన్టీఆర్ మెడకు రాయలసీమ ఉచ్చు!

రాయలసీమలో చిచ్చురేగింది. తెలుగుదేశం ప్రభుత్వం తొందరపాటు నిర్ణయాలు, ఎన్టీరామారావు అనాలోచిత ప్రసంగాలు రాష్ట్రంలో ఒక పెద్ద రాజకీయ అగ్నిపర్వతాన్ని కలియబెట్టి రాజుకునేటట్లు చేశాయి. హైదరాబాదు నగరానికి మంచినీళ్ళు కృష్ణ నుంచి సరఫరా చేయాలని ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావు తీసుకున్న హఠాత్ నిర్ణయం, గుహలో నిద్రపోతుండిన సింహం జూలు పట్టి, లెవ్వగొట్టినట్లుగా పరిణమించింది.

ఎన్టీరామారావేకాదు, రాయలసీమనాయకులుకూడా ఉన్నపాటున ఈ ఉద్యమం ఇంత ఉగ్రరూపం ధరిస్తుందని ఊహించలేదు. శాసనసభలో అత్యంత సాధారణ సమస్యగా ప్రస్తావనకువచ్చిన అంశం కృష్ణనీళ్ళు. ఆసమయంలో మంత్రులు, ప్రభుత్వము ఏమాత్రం రాజనీతిజ్ఞతతో వ్యవహరించివుండినా, మెళకువగా పరిశీలించివుండినా ఆ అంశం ప్రశ్నోత్తరాలంకే, ప్రసంగాలంకే పరిమితమైవుండేది. అయితే కాంగ్రెస్ ఎమ్మెల్యేలుచెప్పే ప్రతిమాటకు, అడిగే ప్రతి ప్రశ్నకు పెడసరంగా ప్రతికూలంగా స్పందించాలనే గ్రుడ్డి ఆదేశాలు వున్న తెలుగు మంత్రులు పాపం, తమకు తెలియకుండానే తమ ప్రభుత్వాన్ని తీవ్రమైన రాజకీయ సంక్షోభంలో పడవేశారు.

నిజానికి ప్రస్తుత పరిస్థితులలో తెలుగుదేశం ఎటువంటి రాజకీయ ప్రతికూల ఉద్యమాలనూ ఎదుర్కొనే పరిస్థితిలోలేదు. కాపునాడువిసిరిన సవాల్‌ను కోస్తాజిల్లాలలో ఎట్లా ఎదుర్కోవాలో అర్థంకాకనే వారు తలలు పగులగొట్టుకుంటున్నారు. ఇప్పుడు ఎన్టీఆర్ పరిస్థితి ముందు నుయ్యి, వెనుక గొయ్యి అన్న సామెతలాగా తయారైంది. హైదరాబాదుకు కృష్ణనీళ్ళు ఇచ్చే విషయం పునరాలోచిస్తామని చెప్తే, తెలంగాణా నాయకులు గొంతుపట్టుకుంటారు; ఆమాటచెప్పకుంటే రాయలసీమ నాయకుల క్రోధాగ్ని చల్లారేటట్లులేదు.

కాంగ్రెస్ శాసనసభ్యులు ఎంతో వైపుణ్యంతో తమ ఆందోళనకు రాష్ట్రవ్యాప్త గుర్తింపు వచ్చేట్లుచేశారు. శాసనసభనుంచే కాక, శాసనసభ గేటు ముందునుంచికూడా వీరిని బలవంతంగాతరలించడం; పోలీసులు వారిని చేతులమీద ఎత్తుకపోతున్నఫోటోలు దినపత్రికలలో ప్రముఖంగా ప్రచురితం కావడం రాయలసీమలో ప్రజలదృష్టిని విశేషంగా ఆకర్షించడమేకాక, వారిలో ఉద్రేకాలను రెచ్చగొట్టాయి.

అసలే సంఘటిత హింసాత్మక రాజకీయాలకు రాయలసీమ ప్రసిద్ధి! పోలీసులకు, కోర్టుకేసులకు భయపడే తత్వం కాదు వారిది. దానిఫలితంగానే ఎమ్మెల్యేల నిరా

**హైదరాబాదు వృత్తాంతం**

హారదీక్ష మూడవరోజుకుకూడా చేరుకోక ముందే ఆర్. టి. సి. బస్సు దహనాలు ప్రారంభమైపోయాయి. బంద్‌లు, ధర్నాలు, రిలేదీక్షలు ముమ్మరంగా మొదలైనాయి. అనంతపురం, కడపజిల్లాలలో పరిస్థితి ఉద్రిక్తంగా వున్నట్లుకూడా చెప్తున్నారు. నిజానికి నిరాహారదీక్షలోవున్న నాయకులెవరూ, జిల్లాలో ఉద్యమం ఏవిధంగా కొనసాగాలో ఎటువంటి సూచనలూ ఇవ్వలేదు. కనీసం జిల్లాకేంద్రాలలో మకాం పెట్టి ఉద్యమకారులను సమీకరించే ప్రయత్నంకూడా చేయలేదు. ప్రజలనుంచే ఉద్యమంపుట్టి, ఎవరికితోచిన మేరకువారు, స్థానిక పరిస్థితులనుబట్టి ఆందోళన జరిపే విధంగా వ్యవహరిస్తున్నారు ఎమ్మెల్యేలు. దీనిఫలితంగా తెలుగుదేశం మంత్రులకు ఉద్యమాన్ని విమర్శించేందుకుకాని దాని నాయకుల చిత్తశుద్ధిపట్ల వ్యాఖ్యలుచేయడం ద్వారా తమతప్పులు కప్పిపుచ్చుకునేందుకు కాని అవకాశం లభించలేదు.

అసలు శాసనసభ్యుల దీక్ష ప్రారంభమైన వెంటనే తెలుగుదేశం ప్రభుత్వం దీన్నొక రాజకీయ సమస్యగా, కాంగ్రెస్ వాదుల రభసగా చిత్రించడానికి ప్రయత్నించి విఫలమైంది. తర్వాత జరిగిన సమావేశయత్నాలు, సమావేశాలు, కమిటీ నియామకాలుకూడా సమస్యను మరింత జటిలం చేశాయేతప్ప, శాంతింపచేయలేదు. ఇందుకోసం నియమించిన కమిటీలో అన్ని ప్రాంతాల నీటిసమస్యల అధ్యయనం అనే అంశం చేర్చడం వివాదాస్పదమైంది. ఈ సందర్భంగా దీక్షలోవున్న ఎమ్మెల్యేలు అడుగుతున్నప్రశ్నలు రాయలసీమ ప్రజలను సూటిగా ఆకర్షించాయి. రాయలసీమకు నీళ్ళివ్వడానికి మిగతాప్రాంతాల వారితో చర్చించాలనిచెప్తున్న ముఖ్యమంత్రి; హైదరాబాదుకు కృష్ణ నీళ్ళిచ్చే విషయంలో రాయలసీమవారిని ఎందుకు సంప్రదించలేదన్నది వీరిప్రశ్న. ఇది వినడానికి ఎవరికైనా సబబుగానే కన్పిస్తుంది. కమిటీలో తాము సూచించిన నిపుణులనుకూడా చేర్చడానికి ఎందుకు సందేహిస్తున్నారన్నది రెండవప్రశ్న.

మొత్తంమీద రాయలసీమ కాంగ్రెస్ ఎమ్మెల్యేలు అల్లిన ఉచ్చు, నిశ్శబ్దంగా ఎన్టీఆర్ మెడకు చుట్టుకున్నది. దీన్ని వదిలించుకోవడానికి ఆయన సామరస్యంగా ప్రయత్నించవలసిందిపోయి ఎదురుదాడికి సమకట్టున్నారు. రాయలసీమకు చెందిన తెలుగుదేశం ఎమ్మెల్యేలు, మంత్రులు జిల్లాలకు వెళ్ళి ఉద్యమాన్ని విఫలంచేయాలని ఆదేశించారు. ఎమ్మెల్యేలు దీక్ష విరమించకుంటే ఢిల్లీలో తమ ఎమ్మెల్యేలు దీక్షలు, ధర్నాలువేస్తారని బెదిరిస్తున్నారు. ఇంకొక

—కొరవ 7వ పేజీలో

# ప్రతిపక్షాలు ఏకమైతే కాంగ్రెస్‌కు ప్రమాదమే!

★ కాంగ్రెస్ పలుకుబడి క్షీణిస్తున్నా రాజీవ్ ఇమేజ్ తగ్గలేదు
★ జనమోర్చ తెలియనివారే ఎక్కువ!
★ ప్రధానిగా ఎన్టీఆర్ అనర్హుడని 85 శాతం మంది నిశ్చితాభిప్రాయం
★ ప్రతిపక్షాలు కలిసి వుంటాయని ఏప్రాంతం ప్రజలూ నమ్మడంలేదు!

'ఇండియా టుడే' అంచనా పోలింగు ఫలితాలు వెలికి వచ్చాయి. దేశంలో రాజకీయ వాదులు, పార్టీల పట్ల ప్రజలలో మారుతున్న అభిప్రాయాలు, అభిమానాలను ఎప్పటికప్పుడు అంచనా కట్టడానికి ఇండియా టుడే ఆంగ్ల వార పత్రిక ప్రతి ఆరునెలల కొకసారి అంచనా పోలింగు నిర్వహిస్తున్నది. ఆ పరంపరలో భాగంగా, మూడవ ఒపీనియన్ పోలింగును మొన్న ఆగస్టు 2 నుండి 7 తేది వరకు నిర్వహించారు. దేశంలోని 200 లోక్‌సభ నియోజక వర్గాల పరిధిలోకి వచ్చే 13 వేల 166 మంది ఓటరు పౌరులను ఇంటర్వ్యూ చేశారు. ఈ సమాచారాన్నంతటినీ కంప్యూటర్ల ద్వారా విశ్లేషించారు. ఎన్నికల ఫలితాల అంచనా విషయంలో ప్రణయ్‌రాయ్ వంటి వారెందరో ఈ విశ్లేషణలో తమ మేధా సంపత్తిని వినియోగించి తుది ఫలితాలను వెలువరించారు.

ఇప్పటికిప్పుడు ఎన్నికలు పెడితే దేశంలో కాంగ్రెస్ పార్టీ గెలుపు అనుమానాస్పదమన్నది ఈ ఒపీనియన్ పోల్ సారాంశం! మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, గుజరాత్ తదితర పశ్చిమ రాష్ట్రాలలో తప్ప తక్కిన దేశమంతా కాంగ్రెస్‌పార్టీ క్రమంగా క్షీణించిపోతున్నదని ఈ నిపుణుల అభిప్రాయం. గత ఫిబ్రవరి పోలింగుకు నేటికికూడా రాజీవ్ గాంధీ పలుకుబడి తగ్గుదలలోనే వున్నదంటున్నారువారు. ఈ ఫిబ్రవరి పోల్‌లో ఉత్తరప్రదేశ్, హర్యానా తదితర ఉత్తర రాష్ట్రాలలోని మొత్తం 136 సీట్లకుగాను కాంగ్రెస్‌కు 74 సీట్లు రావచ్చునని తేలింది. ఇప్పుడు ఆసంఖ్య 49కి తగ్గింది; ఆంధ్ర, కర్ణాటక వంటి దక్షిణరాష్ట్రాలలోని 132 సీట్లకుగాను ఫిబ్రవరిలో 78 గెల్చుకునే అవకాశముండే ప్రస్తుతం యాభై అరింటిలోనే దాన్ని కన్పడుతుంది; అస్సాం, బీహార్ పశ్చిమబెంగాల్, ఒరిస్సా తదితర తూర్పు రాష్ట్రాలలోని 142 స్థానాలకుగాను అప్పుడు అవకాశం తేలింది 86. ఇప్పుడు 76; పశ్చిమ రాష్ట్రాలలో 142 సీట్లకుగాను 109 గెల్చుకోవచ్చుననుకుంటే, ఇప్పుడు 116 వరకు విజయం సాధిస్తారనే ఆశ వ్యక్తమౌతున్నది. మొత్తంమీద అనాడి అంచనా 345 సీట్లయితే, ఈనాడి అంచనా కేవలం 297 సీట్లు; శాతంచూస్తే 63.7 నుంచి 54.8 కి తగ్గింది.

అయితే 1987 ఆగస్టులో, అంటే సరిగ్గా సంవత్సరంనాడుజరిపిన మొదటిఒపీనియన్ పోలింగులో కాంగ్రెస్‌కు 328 సీట్లలో మాత్రమే అవకాశముందని లెక్కగట్టారు. అప్పటికి, 86 ఫిబ్రవరికి రాజీవ్‌గాంధీ పలుకుబడి 4 శాతం, 22 సీట్ల మేరకు పెరిగితే; ఫిబ్రవరికి, ఆగస్టుకు 9 శాతం, 48 సీట్ల మేరకు తగ్గింది. ఇంత తగ్గినట్లు కన్పించినా, 297 సీట్లు గెల్చుకుంటే అధికారంలోకి వచ్చేది కాంగ్రెస్‌పార్టీమాత్రమే! కాని, వారి ఆధిక్యత మాత్రం కేవలం 25 సీట్లకు పరిమితమౌతుంది. కత్తిమీద సాములాంటి గెలుపు అది.

కాంగ్రెస్ పార్టీని మరీ కలవరపరిచే విషయమేమిటంటే, ఈ స్వల్ప ఆధిక్యత అయినా ప్రతిపక్షాలన్నీ వెల్లా చెదరై, ప్రతి నియోజకవర్గంలో ముక్కోణపు పోటీలు సంభవించినప్పుడు మాత్రమే వచ్చేందుకు అవకాశముంది. ప్రతిపక్షాలన్నీ ఏకమై 543 నియోజకవర్గాలలో ఉమ్మడి అభ్యర్థిని పోటీకి పెడితే మాత్రం పరిస్థితి తారుమారై కాంగ్రెస్‌కు 228, ప్రతిపక్షాలకు 300 పైన సీట్లు వచ్చే అవకాశముందని ఇండియా టుడే భయపెడుతున్నది. కాంగ్రెస్ పార్టీకి ప్రస్తుతం (84 ఎన్నికలలో) 415 సీట్లున్నాయి. ఒక్క బి.జె.పి. తక్కిన ప్రతిపక్షాలతో విభేదించి స్వంతంగా పోటీకిదిగినా ప్రతిపక్షాలు పట్టీకొట్టక తప్పదని పేరి అంచనా.

ఒకప్రక్క సీట్లు, ఓట్లలో ప్రజాభిప్రాయం కాంగ్రెస్‌కు ప్రతికూలమౌతున్నా- పరిపాలన, నీతి నిజాయితీ, వ్యక్తిత్వం, నిలకడతనంవంటి లక్షణాలలో ఈనాటికీ రాజీవ్‌గాంధీ అందరు ప్రతిపక్ష నాయకులకంటే అధికమైన ప్రజాభిమానం పొందగల్గుతున్నారు. ప్రధాన మంత్రిగా

-కొరవ 8వ పేజీలో

## ఇండియా టుడే ఒపీనియన్ పోల్‌లో వెల్లడైన వాస్తవాలు

# పినాకినీ తీరం

### అపప్రథ పోయింది!

భాగ్యవంతులైన నెల్లూరు యువకులకు సంబంధించి పూర్వం ఒక అపప్రథ వుండేది. పెద్దలు సంపాదించి పెట్టిన ఆస్తులు ఆదాయాలతో షడ్రసోపేతంగా తినడం, విలాసవంతంగా కాలం గడపడం తప్ప కష్టపడి పనిచేయరని, వ్యవసాయం తప్ప, వ్యాపార పారిశ్రామిక రంగాలలో ప్రవేశిద్దామనే వూసే వారికుండదని అనుకునేవారు. తమ పొలం ఎక్కడుందో వారికి తెలిసేదికాదు; దాని హద్దులేమిటో వారెరుగరు; పైరు ఎట్లావుందో వారు చూడరు; ఎన్ని పండినాయో వారికి అంచనాలేదు. వారికి తెలిసిందల్లా తలమనుషులు పండించి గాదెలు నింపితే వాటిని అమ్ముకొని అనుభవించడం ఒక్కటే వారికి తెలిసిన పని. ఇవి నా అభిప్రాయాలు కాదు; నేనంటున్న మాటలూకాదు; పూర్వం పదిమంది నోట నానుతుండిన పలుకులు.

పరిశ్రమల విషయంలో నెల్లూరుజిల్లా వెనుకబడివున్నదనే ప్రస్తావన వచ్చినప్పుడల్లా రాజకీయనాయకులు బహిరంగసభల్లో చెప్పేవారు. ఏమని అనుకున్నారు? నెల్లూరుజిల్లా రెడ్డియువకులు సుఖజీవనానికి అలవాటుపడిన సోమరులు. పేకముక్కల పారాయణం, రేసుల వ్యసనం, కొత్త మేటినీ సినిమావచ్చినా మద్రాసుకు కారు షికారు, మైకపు మాధుర్యం...వున్న డబ్బంతా ఈవిధంగా దుర్వ్యయంచేయడం తప్ప పరిశ్రమలమీద పెట్టుబడి పెట్టి తమ సంపదకు సార్థకత కూర్చి, జిల్లాఅభివృద్ధికి దోహదమిద్దామనే ఆలోచనే ఈ కుర్రకారుకురాదు. ఇక పరిశ్రమలు రమ్మంటే ఎట్లావస్తాయి అని నిర్మొహమాటంగా మన మొహాన్నే అడిగేసేవారు. పరాయివారు ఈ మాటలంటున్నారే అని మనకు కాస్త బాధగా వుండివుండవచ్చుగాని, అందులో ఒక్క అక్షరంకూడా సత్యదూరంకాదు.

యువతరపు ఈ తేలికజీవిత పర్యవసానంగా పెద్దకమతాలభూములు క్రమంగా తరుగుతూవచ్చాయి, తలమనుషుల భూస్థితి పెరుగుతూవచ్చింది; వారి అవసరాలకు పత్తిపాళ్ళలు అప్పు ఇవ్వగలిగిన స్థితిలోవున్న పేరు,వారివద్ద అప్పుపట్టవలసినపరిస్థితివచ్చింది; పూర్వం అసలురెడ్డి తనపదవులుకట్టి తలమనిషే రెడ్డిగా చెలామణి అయ్యేవారు. అందరినీ ఒకగాట కట్టివేయడం నావుద్దేశ్యంకాదు; జాగ్రత్తగా వున్నవారూ లేకపోలేదు. కాంగ్రెస్ ప్రభావమో, సీలింగులఫలితమో సమాజ పరిణామమో కారణం ఏమైందీ పద మిద్ధంగా చెప్పలేముగాని, పల్లెల్లో 'ఓల్డు క్లాస్' నిష్క్రమించి 'న్యూ క్లాస్' ఆవిర్భవించింది. బండ్లు ఓడలు, ఓడలు బండ్లు అయ్యాయి. పల్లెల ప్రాభవం తగ్గిపోయింది, పట్నవాసాల ప్రాధాన్యత హెచ్చింది. రెండుమూడు దశాబ్దాల క్రితం ప్రారంభమై నిదానంగా జరుగుతూవస్తున్న పరిణామమిది.

కాలం కళ్ళు తెరిపించింది; అవకాశాలు అందివచ్చాయి. మనజిల్లా సంపన్న యువకులమీద వుండిన ఆ అపప్రథకు కాలదోషంపట్టింది. అప్పుడు ఎంత సుఖమయమైన సోమరి జీవితాన్ని గడు

—కొరవ 8వ పేజీలో

# జమీన్‌రైతు

## రాయలసీమ లేచింది!

రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలకంటే మేమువెనుకబడివున్నాం, కరవుకాటకాలతో అణగారిపోతున్నాం, మమ్ములను నిర్లక్ష్యంచేస్తున్నారు అని రాయలసీమవాసులు వాగ్రూపంగా ప్రకటనలు చేయడం, ఆందోళన జరపడంతప్ప ఇంతవరకు ప్రత్యక్షచర్యకు దిగలేదు. ఎప్పుడైతే వై. ఎస్. రాజశేఖరరెడ్డి ప్రభృతి పన్నెండుమంది కాంగ్రెస్ శాసనసభ్యులు శాసనసభలో తిరగబడి, స్పీకరుచేత సస్పెండు గావింపబడి, నిరాహారదీక్ష ఉపక్రమించి, అసెంబ్లీ వరండానుండిగూడా గెంటబడి శాసనసభ్యుల వసతిగృహప్రాంగణంలో మొండిగా దీక్ష కొనసాగించారోఅప్పుడే రాయలసీమ యావత్తు వువ్వెత్తున లేచింది; వుద్యమాని కుపక్రమించింది.

బందులు, హర్తాళ్ళు, బస్సులదహనాలు, రైళ్ళ రాకపోకలకు ఆటంకాలు నాలుగు జిల్లాలలో, ముఖ్యంగా కడప- కర్నూలు- అనంతపురం జిల్లాలలో వుధృతంగానే జరిగాయి; చిత్తూరు జిల్లాకూడా ఇప్పుడిప్పుడే ఆ జిల్లాల దారినపడుతున్నది. ప్రస్తుతానికి ఈ నిరసనోద్యమం ఒక్కరోజుకే పరిమితమైంది. శాసనసభ్యుల నిరాహార దీక్షలు ప్రారంభమై వారం దాటింది; అవి ఇంకాకూడా కొనసాగితే; దీక్షలో వున్న శాసనసభ్యుల ఆరోగ్యంక్షీణించి ఆందోళనకరంగా పరిణమిస్తే, రాయలసీమ యావత్తు ఒక అగ్నిగుండంగా తయారైనా ఆశ్చర్యం లేదు. అంతేకాదు, తమకు సకాలంలో తగిన సహాయం జరగకుంటే; ప్రత్యేక రాయలసీమ రాష్ట్రాన్ని కోరవలసివస్తుందనే మాటలుకూడా లీలగా వినిపిస్తున్నాయి. అందుచే ప్రభుత్వం శాసనసభ్యులకు నచ్చచెప్పి వెంటనే దీక్షను విరమింపజేస్తేతప్ప మరొక వేర్పాటువుద్యమానికి నాంది పల్కినదవుతుంది.

అంతకు ముందుసంగతి అటుంచి, ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరం తొమ్మిదిమంది- రామారావుగారుకాక- ముఖ్యమంత్రులుగా రాజ్యంచేస్తే, అందులో ముగ్గురు రాయలసీమ నాయకులు. ఈముగ్గురిలో కూడా నీలం సంజీవరెడ్డి ఎదురులేని ముఖ్యమంత్రిగా అధికారం చెలాయించినవాడు. ఇక రాయలసీమ నాలుగుజిల్లాలకు ప్రాతినిధ్యంలేని మంత్రివర్గం ఎన్నడూలేదు. అటువంటప్పుడు రాయలసీమ అభివృద్ధిపట్ల ప్రత్యేకశ్రద్ధ ఎందుకు ప్రదర్శితంకాలేదో విచిత్రం! బహుశా ఆ ముఖ్యమంత్రులు యావత్ రాష్ట్రాన్ని దృష్టిలో వుంచుకొని విశాల హృదయంతో వ్యవహరించడం, శాసనసభలో తక్కిన రెండు ప్రాంతాల వారి బలము, మంత్రివర్గాలమీద వారి ప్రభావము ఎక్కువకావడం వారు తమప్రాంత అభివృద్ధిపట్ల పక్షపాతం వహించడానికి వీలు కల్గించలేదేమో?

ఏమైనా ఏటికేటికి వర్షాలు తగ్గిపోతూ, కొత్తకొత్త ప్రాజెక్టుల నిర్మాణం వెనుకబడుతూ, పంటలులేక త్రాగడానికి నీళ్ళులేక రాయలసీమ పరిస్థితి దయనీయంగా తయారైంది. అదీగాక కృష్ణానది అదనపు నీటిపంపకానికి సరిపోయేటట్లు పథకాలు అమలుజరుగుతున్నాయి. ప్రస్తుత ప్రాజెక్టులకే కృష్ణనీరు సరిపోదనుకుంటుంటే, జంటనగరాలకు కృష్ణనుండే మంచినీరు సరఫరాచేయగలమని ముఖ్యమంత్రి మాట ఇచ్చారు. ఇవన్నీ రాయలసీమ వాసులను మేలుకొల్పాయి; ఇప్పుడు వూరకుంటే రాయలసీమ శాశ్వతంగా రాళ్ళసీమేననే అభిప్రాయం దృఢపడి, తాడోపేడో తేల్చుకోడానికి తెగబడ్డారు.

ముఖ్యమంత్రి రామారావు మాటలమీద నమ్మకం లేకపోవడంవల్లనే, నీటిపంపకం విషయం సమగ్రపరిశీలనకు కమిటీ ఏర్పాటు చేయబడినా వారికి సమ్మతకరం కాలేదు. ఏమైనా రాయలసీమ శాసనసభ్యులు తమ నిరాహారదీక్షద్వారా తమ లక్ష్యాన్ని నెరవేర్చుకోగలిగారు. ఈ పరిస్థితుల్లో రాయలసీమను నిర్లక్ష్యంచేసే సాహసం ప్రభుత్వానికి వుండదు. అందువల్ల తెగేందాకాలాగకుండా, కాంగ్రెస్- ప్రతిపక్షాల నాయకుల విజ్ఞప్తిని మన్నించి దీక్ష విరమించడం బాగుంటుంది.

# జమీన్‌రైతు

26-8-1938

### ఏ. సి. మీద క్రమశిక్షణచర్య

ఈనెల తే 12, 13 దీలలో వెంకటగిరి యందు జరిగిన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీవారు కావించిన తీర్మానములలో ఒకటి.

నెల్లూరు మునిసిపల్ ఛేర్మను ఎన్నికలలో కాంగ్రెసు అభ్యర్థికి వ్యతిరేకంగా పోటీచేసిన ఏ. సి. సుబ్బారెడ్డిగారును, వీరికి ఓటు చేసిన 10 మందియు తమ పదవులకు రాజీనామా యివ్వవలెననియు, కాంగ్రెసు సంస్థలందును, స్థానిక సంస్థలందును ఏ ఎన్నిక పదవులకుగాని 3 సం॥ల వరకు సభ్యులుగా నుండరాదనియు తీర్మానించిరి.

మునిసిపాలిటీ ఎన్నికలు ఏ కారణంచేతనైనా 3 సం॥ పిమ్మట జరుగునెడల అంతవరకును యీ ఆంక్ష వుండును.

### సౌతుబోర్డు వైస్‌ప్రెసిడెంటు టూరు

నెల్లూరు సౌతుబోర్డు వైస్‌ప్రెసిడెంటుగారగు దేగా రామిరెడ్డిగారు నిరంతరం టూరు చేసి స్కూళ్ళు ఆసుపత్రులు తనిఖీచేస్తున్నారు. వెనుక యీ పద్ధతి లేనందున పైరెండుసంస్థలు పూర్తిగా అధ్వాన్నమైపోయినవి.

### పెన్నా ఆనకట్టవద్ద షట్టర్సు మీటింగు

పెన్నానది నెల్లూరు ఆనకట్ట క్రింది రైతుల సమావేశము 24-8-38 తేదీ నెల్లూరు దక్షిణబోర్డు ఆఫీసులో వంగల్లు కోదండరామిరెడ్డిగారి అధ్యక్షత క్రింద సమావేశమై ఈ క్రింది తీర్మానములు గావించిరి.

బెజవాడ ఆనకట్టమీద తీసివేయబడిన చెక్కలను (Shutters) నెల్లూరు ఆనకట్టమీద పెట్టుటకు ఉద్దేశించియుండినన్ని అట్లు చేయక మా హక్కును త్రృణీకరిస్తూ మాకు భంగకరంగా సంగం ఆనకట్టవద్ద అదే షట్టర్లు పెట్టి మనఅభివృద్ధిని ప్రభుత్వం వారు ఉపేక్షించినారని యీ సభవారు అభిప్రాయపడుచూ సదరు పెన్నానదికి నెల్లూరువద్ద షట్టర్లు పెట్టువరకు నిరంతరం ఆందోళన సల్పవలయునని యీ సభవారు తీర్మానించుచున్నారు.

### 50 ఏళ్ల క్రితం ఈ వారం

### గూడూరు సంగతులు

చలయ్య కంపెనీ : ఓరియంటల్ కంపెనీవారు రెండు మాసాలుగా బట్వాడాలివ్వలేదు.

శెట్టి కంపెనీ : వాకాటిశెట్టి నేషనల్ మైకా కంపెనీలో పనిజాస్తి, కూలి తక్కువ. అందరికంటే ఆడు స్త్రీకి 0-0-6, మొగవానికి 0-1-0, కూలి తక్కువ. అదియు సాయంత్రం 6 గం॥కు వదిలితే అక్కడ 7-8 గంట లవుతుంది.

కాలేపల్లి కంపెనీ : కాలేపల్లి కృష్ణయ్యగారి యునైటెడ్ మైకా కంపెనీలోగూడ- డిటో- డిటో- డిటో.

ప్లాంటర్లు : దీనిలోగూడ ఇదివరకు రాత్రి 7-8 గం॥ల దాకా మూలించేవి పనులు చేయించేవిగాని సర్వారెడ్డి కుమారుడి ప్రవర్తనం వచ్చిన తర్వాత సా॥ 6 గం॥లకే విడుదల.

### గుబ్బి కంపెనీ

గుబ్బి నాటక సమాజంవారు 16 రోజులు కురుక్షేత్ర సంగ్రామం చేశారు నెల్లూరులో పాపం! చివర నష్టంతోనే ఊడాయిల్తారు. 21 తేదీ వేసిన కృష్ణలీలలకు టోటల్ కలెక్షను 740 లట. దీనిలో కాలేజీకమిటీకి రు 500 లు యిచ్చి నమస్కరించారు.

### “ఢంకా”

తిరుగా “ఢంకా” మాసపత్రిక ఆగస్టు ప్రథమ సంచిక మా కందింది. సంపాదకులు వెనుకటి బి. టి. నరసింహాచార్యగారే! వీరి ప్రతిభకు పూర్వపు “వినోదిని” మాసపత్రికే సాక్షి. వారన్నట్లు “ఎల్లప్పుడు జాతీయాదర్శాన్ని ఆదర్శంగా పెట్టుకొని ముగమాటములు, పాక్షిక భావములు, జంకుగొంకు లేకుండా” ‘ఢంకా’ నిరంతరం బజాయించి ఆంధ్ర ప్రజాభ్యుదయానికి పాటుబడుగాక.

## జనవాణి

## జాతీయనాయకులకు సిగ్గుచేటు

ప్రతిపక్షాలంతా పదవీకాంక్షతో ఎగబడుతూ దేశాన్ని భ్రష్టుపట్టించే ప్రయత్నం చేస్తున్నాయి. ప్రతిపక్షాలవారిది అధికార దాహమేగానీ ప్రజలమీద మమకారం కాదు, దేశాభిమానం అంతకంటేకాదు. ఇటువంటివారికి దేశాన్ని అప్పగిస్తే చేజేతులా వినాశనాన్ని కొనితెచ్చుకున్నట్లే. ఒక బహుగుణగానీ, ఒక ఎన్టీఆర్‌గానీ, ఒక అజిత్‌సింగ్‌గానీ, ఒక రామకృష్ణ హెగ్డేగానీ ఈ సువిశాల ప్రజాస్వామ్య దేశాన్ని పరిపాలించే స్థాయికి ఎదగలేదు, ఎదగలేరుకూడా. ఎన్టీఆర్ వంటి నియంతను, అహంభావిని, ఫాసిస్టును ఈ దేశానికి ప్రధాని చెయ్యడంకంటే పాకిస్తాన్‌లాగా, బాంగ్లాదేశ్‌లాగా సైనిక పాలనలో నడపడమే ఉత్తమం. చీటికిమాటికి రాజీనామాచేసే హెగ్డే ప్రధాని అయితే ఏమౌతుందో వూహించుకుంటేనే భయమేస్తుంది. నెలరోజులకొకసారి పార్లమెంటు ఎన్నికలు జరపవలసివస్తుందేమో!

ఇక సీట్ల సర్దుబాటు విషయంచూస్తే గత అసెంబ్లీ ఎన్నికలలో మాదిరిగానే రామారావు ఇతర ప్రతిపక్షాల మొగాన కొన్ని సీట్లు పడేసి మిగతావన్నీ తనకే కావాలంటాడు. రాష్ట్రంలో మార్క్సిస్టుపార్టీ మోస్తరు ఎంగిలి మెతుకులు తినే కుక్కలవలె (రామారావు భాషఅది) జాతీయ ప్రతిపక్షాలన్నీ ఎన్టీఆర్ విదిల్చే ముష్టిసీట్లకోసం గోతికాడ నక్కలలాగా కూర్చోవల్సిందే. ప్రతిపక్షాల ఐక్యత పేరుతో పార్లమెంటు సీట్లను ఎన్టీఆర్ దయాధర్మానికి వదలడంకంటే జాతీయ నాయకులకు సిగ్గుచేటైన విషయం మరొకటిలేదు. పదవీ దాహంతో ఎన్టీ రామారావు మోచేతినీళ్ళు త్రాగడంకంటే హుందాగా ప్రతిపక్షనాయకులుగా వ్యవహరించడమే తలలు పండిన జాతీయ నాయకులకు గౌరవప్రదం.

దేశానికి కావలసింది ఏదోఒక విధంగా ప్రతిపక్షాలు అధికారంలోకి రావడంకాదు. సుస్థిరమైన, అరాచకంలేని పరిపాలన. అది దేశానికివ్వగల సామర్థ్యం ఒక్క కాంగ్రెస్ పార్టీకే వుంది.

నెల్లూరు -వై. జయరామయ్య

### వి. ఆర్. సాయంకళాశాల మళ్ళీ ప్రారంభించండి!

వి. ఆర్. సాయంకళాశాల మూసివేతవల్ల డిగ్రీ విద్యార్థులు ఎంతో నష్టపోతున్నారు. నానాటికీ విద్యార్థులసంఖ్య పెరుగుతుండగా కాలేజీల సంఖ్య పెంచవలసింది పోయి; పొదుపు పేరుతో వున్న కాలేజీలు కూడా మూసివెయ్యడం రాష్ట్ర ప్రభుత్వ దివాళాకోరుతనానికి నిదర్శనం. సాయం

—కొరవ 10 వ పేజీలో

# దాస్‌ప్రకాష్ ఐస్‌క్రీం రుచులను ఆంధ్రకు తెచ్చింది నెల్లూరు కపర్ది!

ఎనిమిది నెలల క్రితం 'ఐసోలో' 'రేక్స్' ఉత్పత్తి పరిశ్రమను స్థాపించి, అనతి కాలంలో అందరినోటా ఐసోలో అనిపించి ఐసోలో అనిపించిన శ్రీ వై. సీరారెడ్డి, కపర్ది ఫుడ్స్ సంస్థను స్థాపించి దక్షిణ పథంలో తయారయ్యే దాస్‌ప్రకాష్ ఐస్‌క్రీములను, పసందైన పంచదుడం శీతల క్షీరాలను, దక్షిణ భారతంలో ఎక్కడాలేని 'కోల్డ్ కాఫీ'ని నెల్లూరీయుల చేతనేకాదు, తెలుగువారందరిచేత చవిచూపించ బోతున్నారు.

## సింహపురి

నెల్లూరు టవునుకు ఐదుమైళ్ళదూరంలో నారాయణరెడ్డిపేట వద్ద 50 లక్షల రూపాయల వ్యయంతో నిర్మింపబడిన ఈ కపర్ది ఫుడ్స్ ఫ్యాక్టరీలోని వివిధ విభాగాలకు 19 తేది జయప్రదంగా ప్రారంభోత్సవం జరిగింది. ఐస్‌క్రీం ఫ్యాక్టరీకి తిరుమల తిరుపతి దేవస్థానం పాలకవర్గ అధ్యక్షుడు శ్రీ పి. సీతారామయ్య, శీతల క్షీర, కోల్డు కాఫీ తయారీవిభాగానికి స్టేట్ బ్యాంకి తిరుపతి ప్రాంతీయ మేనేజరు శ్రీ పి. ఎల్. ఎన్. రావు ప్రారంభోత్సవాలు జరిపారు. మద్రాసు- దాస్‌ప్రకాష్ ఐస్‌క్రీమ్స్ చేసే జి.గ్. డైరెక్టరు శ్రీ రాందాస్, మద్రాసు- ఐసోలో బ్రదర్స్ మేనేజింగ్ డైరెక్టరు శ్రీకృష్ణణ సభలోపాల్గొని కపర్ది ఫుడ్స్ ఉత్పత్తి వ్యాపారాలు మూడు పూలు ఆరుకాయలుగా విస్తరిల్లి ప్రజలకు చేరువ లను, యువమాములకు లాభాలను చేకూర్చి పెట్టాలని ఆకాంక్ష వెలిబుచ్చారు.

తొలుత సంస్థ మేనేజింగ్ డైరెక్టరు శ్రీ వై. సీరారెడ్డి అహూతులకు స్వాగతం చెప్తూ, సంస్థ నిర్మాణంలో తమకు అందరి నుండి లభించిన సహాయ సహకారాలకు కృతజ్ఞత తెల్పుతూ, దాస్‌ప్రకాష్ ఐస్‌క్రీముల ఉత్పత్తి, పంపక హక్కులను రాష్ట్రానికంతటికీ తాము పొందగలగడం సంతోషంగా వున్నదన్నారు.

సా. 6-15 కు ప్రారంభం కావలసిన ప్రారంభోత్సవసభ మూటయా త్రైనిమిషాలు ఆలస్యంగా ఆరంభమైంది. టి. టి. డి. ఛైర్మన్ వచ్చిన ఢిల్లీ విమానం నాలుగు గంటలు ఆలస్యమట; పాపం, ఆయన తిండితిప్పలుకూడా మానుకొని ఆగమేఘాల మీద మద్రాసు నుండి నెల్లూరు చేరారు; సభ ఆలస్యానికి అదేకారణం. కపర్ది ఫుడ్స్ మేనేజిమెంటు స్వాగతించడంలో శ్రీ సీతా రామయ్యను తీల్‌చేసింది; మంగళ బ్యాండు

—తరువాత 8వ పేజీలో

అమెరికాకు...

మద్రాసు ఐ ఐ టి లో స్వర్ణపతక గ్రహీతగా కంప్యూటర్ సైన్స్ ఎం. టెక్. లో ప్రతిష్ఠాకరంగా ఉత్తీర్ణులై, న్యూయార్కులోని స్టోనీబ్రూక్ యూనివర్సిటీలో స్కాలర్‌షిప్‌మీద పిహెచ్. డి. చేయడానికి ఇటీవల అమెరికాకుబయలుదేరి పోయిన శ్రీ పి. వేణుగోపాలరెడ్డి.

వేణుగోపాలరెడ్డి ఫారెస్టు రేంజరు, యల్లాయపాలెంవాసి శ్రీ పాలచూరు శివా రెడ్డి కుమారుడు.

ఉన్నత విద్యకు అమెరికాకు పోతున్న వేణుగోపాలరెడ్డికి మా శుభాకాంక్షలు.

# మధుర కవి నాళం కృష్ణరావు

వాకాటి పెంచలురెడ్డి

ఆంధ్ర వాఙ్మయంలో బాల సాహిత్యానికి ప్రముఖ స్థానంవుంది. బాలబాలికలను సన్మార్గప్రవర్తనులుగా చేయడానికి కవులు పద్యాలు, గేయాలు, కథలు వ్రాశారు. కొన్ని సంవత్సరాల క్రిందట ప్రాథమిక పాఠశాలల్లో సుమతి శతకం, వేమన శతకం వంటి శతక పద్యాలను విద్యార్థుల చేత కంఠస్థం చేయించేవారు.

బాల సాహిత్య రచయితల్లో మధురకవి నాళం కృష్ణారావుగారు ప్రముఖులు. ఆయన జన్మస్థానం రాజమండ్రి. సుప్రసిద్ధ కవయిత్రి కళాప్రపూర్ణ ఊటుకూరు లక్ష్మీకాంతమ్మ ఆయన కుమార్తె.

ఊటుకూరు లక్ష్మీకాంతమ్మ రచించిన "ఆంధ్ర కవయిత్రులు" అనే గ్రంథా విష్కరణకు నేను బాపట్లకు వెళ్ళిన సందర్భంలో కృష్ణారావుగారిని, వారి సతీమణి సుశీలమ్మను చూచేభాగ్యం కల్గింది. "గోరు ముద్దలు", "మీగడ తరగలు", "వెన్న బుడగలు", "పాలతరగలు" "తేనె చినుకులు", "దీపావళి", "విరిదండ", "వెన్నెల వెలుగులు" "పాపాయి" మొదలైనవి కృష్ణారావుగారి రచనలు.

"పాలతరగలు" కావ్యంలో "అంధ బాలుడు" అనే శీర్షికలో అంధ బాలునికి రేయి, పగలు ఎట్లుంటుందో ఈ క్రింది పద్యాన్ని చూడండి-

"పగలురేయని వింతగా బలుకుచుంద్రు
పగలు రేయియు నాకొక పగిదిదోచు
ఏను మేల్కొనియున్నప్పదెల్లపగలు
ఏను నిద్రించి యున్నప్ప డెల్లరేయి"

సామాన్యంగా గుడ్డివారిని కనికరించు స్వభావం దయార్ద్ర హృదయులకు కలుగుట సహజం. కాని అంధుని ప్రార్థన గమనార్హం.

"దుర్లభంబగుదానికై దుఃఖమొంది
వెలుతురేటికి మీరు నా కొరకుగాంచి
మీకుమొక్కెద నాకొరి రాకుగయ్య
గ్రుడ్డి అయ్యును దేవునిబిడ్డగాదె"

"గోరుముద్దలు" అనేకావ్యంలో 'తల్లి'ని గురించి వ్రాసిన పద్యాలు కమనీయ పద



స్వాతంత్ర్య దినోత్సవంనాడు ఇందిరా కాంగ్రెస్ భవనంలోని ఇందిరాగాంధీ విగ్రహానికి నేదురుమల్లి జనార్దనరెడ్డి పూలమాలవేసిన అనంతరం విగ్రహం ముందు-ఎడమనుండి వరుసగా-సోమంతు సుబ్బారెడ్డి, కె.ఎల్. నారాయణరావు, కె. వి. సుబ్బారెడ్డి, జనార్దనరెడ్డి, జె. కె. రెడ్డి, ఆనం సంజీవరెడ్డి, ఆకిమూర్తి, దొంతంశెట్టి కన్నయ్య, యూత్ కాంగ్రెసీయులు మెట్టా చంద్రశేఖరరెడ్డి, దేవూరు దేవకుమార్ రెడ్డి ప్రభృతులుకూడా గ్రూపులోవున్నారు

# విద్యార్థి సంఘాలు

ఒక్క సర్వోదయలో తప్పనిస్తే టౌనులో మిగలా అన్ని కళాశాలల్లో మొన్నటి విద్యార్థిసంఘాల ఎన్నికలు ప్రశాంతంగా జరిగాయి. వి. ఆర్. కాలేజి అబ్బాయిలు మాత్రం టౌనును దడదడలాడించిపారేశారు ఎప్పటిలాగే. అన్ని కాలేజీల ఎన్నికలు ఒకేరోజున జరగడం, ముందుగానే టౌనులో 144 సెక్షనువిధించి కట్టుదిట్టాలు చెయ్యడంతో గొడవలేమీ జరగలేదు.

వి. ఆర్. కాలేజి విద్యార్థిసంఘ అధ్యక్షుడుగా ఎన్. రవీంద్రరెడ్డి, ఉపాధ్యక్షుడుగా సిహెచ్. మాధవరెడ్డి, కార్యదర్శిగా ఎం. సుధీర్ రెడ్డి, ఫైన్ ఆర్ట్సు కార్యదర్శిగా జి. వెంకటరమణయ్య,గేమ్స్ కార్యదర్శిగా రవీంద్రబాబు ఎన్నికైనారు.

డి. కె. డబ్ల్యు. అమ్మాయిలు

డి. కె. ఉమెన్స్ కాలేజి అమ్మాయిలు పార్టీ రహితంగా, గుట్టుగా ఎన్నికలు జరుపుకున్నారు. ప్రెసిడెంటుగా పి. సుధారాణి, వైస్ ప్రెసిడెంటుగా పి. నాగేశ్వరమ్మ, జాయింట్ సెక్రటరీగా కె. లలిత కుమారి, గేమ్స్ సెక్రెటరీగా కె. పద్మజ, ఫైన్ ఆర్ట్స్ సెక్రెటరీగా ఎస్. ఎన్. వనజ లతలను ఎన్నుకున్నారు.

వి. ఆర్. సాయం కళాశాలలో ఎస్. ఎఫ్. ఐ. పైచేయి

వి. ఆర్. సాయం కళాశాలలో ఎస్. ఎఫ్. ఐ. విద్యార్థులు విజయం సాధించారు. ప్రెసిడెంట్ డి. పెంచలరావు, సెక్రటరీ కె. మురళీకృష్ణ, ఫైన్ఆర్ట్స్ సెక్రెటరీ

—తరువాత 11వ పేజీలో

# మునిసిపల్ కమీషనర్లు ఇట్లా పారిపోతున్నారేమి?

కావలి, గూడూరు మునిసిపాలిటీలకు కొత్త కమీషనర్లు నియమితులైనారు.

కావలిలో శ్రీ అశ్వత్థనారాయణ గత నెల 8 తేది మునిసిపల్ కమీషనర్‌గా చార్జి తీసుకున్నారు. ఈ నెల 11 తేది బదిలీ అయి, గూడూరులో చార్జితీసుకొన్నారు. ఒక్క నెలరోజులలోనే ఆయన కావలి అంటే భయపడిపోయాడట. తెలుగుదేశం రాజ్యంలో ప్రతికౌన్సిలరూ చేర్మెన్‌మాదిరి కర్రపెత్తనం చేయడం మామూలు; అది ఆయనకు కొత్తకాబోలు తత్తరపడిపోయాడట. పైగా ప్రతి తెలుగునాయకుడికీ వారి వారి హోదానుబట్టి నెలమామూళ్ళు చెల్లించడమూ కావలిలో మామూలే; అందులోనూ విఫలులైనట్లున్నారు పాపం! కౌన్సిలర్లందరూ నెలరోజులు తిరగేసరికే తమతమకారణాలతో తన్నైరచేయడంతో చేర్మెన్ కరుణకోర్చి, సిఫార్సు చేయించుకుని గూడూరుకు పారిపోయాడట. కానీ, పెనంమీదనుంచి పొయ్యిలో పడుతున్నానన్న సంగతి మరచినట్లున్నారు.

కావలికి, ఓలకలూరిపేట నుంచి శ్రీ దీనదయాళ్ బదిలీ అయివచ్చారు.

గూడూరు కమీషనర్ శ్రీ మహమ్మద్ ముస్తఫాషరీఫ్ బదిలీమీద వెళ్ళిపోయాడు. ఆయనా తనంతటతాను బదిలీ చేయించుకుని వెళ్ళిపోయినట్లుంది. నిజానికి షరీఫ్‌ను స్థానిక తెలుగునాయకులు మంత్రిని అడిగి బదిలీ వేయించుకున్నారట. మధ్యలో ఒకసారి ఆయనకు విజయవాడ బదిలీ ఉత్తర్వులు వస్తే పట్టుబట్టి రద్దు చేయించుకొని వచ్చారట. అయితే షరీఫ్ గారు ఆ 'ఋణాన్ని' తిరిగి చెల్లించడంలో విఫలుడను ఎదుర్కొన్నట్లున్నారు. ఎందుకొచ్చిన పీడ అనుకుని వెళ్ళిపోయారు.

మునిసిపల్ కమీషనర్లు ఇట్లా ఒకరి వెంట మరొకరుగా తరలిపోవడం వింతగా లేదా? మునిసిపాలిటీలలో తెలుగు నాయకుల జోక్యం మరీ అంత పెరిగిపోయిందా?

## జిల్లావార్తలు

### టీచర్ల బదిలీలు : ఒక జవాబు

గతవారం జి. ప్ర. ప. టీచర్ల బదిలీలకు సంబంధించి మేము వ్రాసినదానిలో క్రింది స్థాయిలో చేతులు తడపడంకూడా జరుగుతున్నదని చేసిన వ్యాఖ్యకు ఒక ఆకాశరామన్న జవాబు వ్రాశాడు. జవాబు క్రింద సంతకం లేదుకాబట్టే పాపం చేయి తడిపిన వ్యక్తి ఎవరైనా అక్కసుతో వ్రాశాడేమోననిపిస్తుంది.

ఆ ఆకాశరామన్న అంటాడు—చేతులు తడిసివుంటే పైవారిచేతులే తడిసివుండాలని రెండుమూడుపేర్లు వుదహరిస్తూ; హెచ్. ఆర్. ఎ. లో వుండేవారంతా వీరి (జి ప్ర ప. చేర్మెన్) మనిషేకాని; దిక్కుమొక్కు లేనివారు, ముసలివారు, అంగవైకల్యురు, స్త్రీలు 870 జి. ఓ. పేరుతో దూరప్రాంతాలకు విసిరివేయబడ్డారు అంటాడు. ఈ మాటమాత్రం అక్షరాలా నిజం!

### గూడూరు కంకర దొంగలు

ఎవరోకాదు;సాక్షాత్తు రైల్వేకాంట్రాక్టర్లేనట. గూడూరు మండలం, వెంకటగిరి ఫారెస్ట్ రేంజి డివిజనుకుచెందిన నెర్నూరు, కొమ్మనేటూరు, గొల్లపల్లి గ్రామాదులలో కొందరు రైల్వే కాంట్రాక్టర్లు ఎవ్వరికీ తెలియకుండా గుంటలుత్రవ్వి కంకరను లారీలకెత్తుకపోతున్నారట. రైల్వే ట్రాక్‌లకు వాడుకుంటున్నట్లున్నారు. ఫారెస్టు అధికార్లు కూడా పట్టించుకోవడంలేదట. పైగా ఈ కంకర త్రవ్విన గుంటలలో మేతకుపోయినపశువులు పడిపోయి, ఎవరూ చూడకపోతే అక్కడే చనిపోతున్నా యంటున్నారు గ్రామస్థులు. ఈ అక్రమాన్ని అరికట్టండి.

### కొడవలూరు పికెటింగ్

గిరిజనులకు ఇండ్లస్థలాలకు ఇచ్చిన భూమిని సర్వేచేసి ఎవరిస్థలం వారికి ఇవ్వవలసిందిగా కోరుతూ కమ్యూనిస్టుపార్టీ కొడవలూరుమండలం ఆఫీసువద్ద పికెటింగు జరిపింది. ఎం. ఆర్. ఓ. ఆఫీసులోకి పోకుండా రెండుగంటలసేపు నిరోధించారట. గిరిజనుల ఇండ్లస్థలంలో ఆస్పత్రి కట్టడం అన్యాయమనికూడా వాపు అంటో కనచేశారు.

-కొరవ 10వ పేజీలో

# కావలి పౌరులు కొత్త మహిళా జూనియర్ కాలేజిని సాధించారు!

కావలీయులు మరొక కొత్తకాలేజి సంపాదించుకున్నారు. ఎన్టీరామారావు లాగాగా ప్రవేశపెట్టిన తెలుగు విద్యా విక్రయ పథకం క్రింద, కావలి తెలుగు దేశీయులు ఒక 'సహకార మహిళా జూనియర్ కాలేజి'కి అనుమతి సంపాదించారు. శ్రీ గొట్టిపాటి కొండపనాయుడు, మునిసిపల్ ఛేర్మెన్ డాక్టర్ ప్రభాకరనాయుడు తదితర స్వపక్షీయుల ఆధ్వర్యంలో నడిచే ఈ కాలేజిని జి ప్ర ప హైస్కూలు ఆవరణంలోని ఐ టి ఐ భవన సముదాయంలో ప్రారంభిస్తున్నారు. హైస్కూలులోని అరలక్షరూపాయల విలువైన లేబరేటరీ పరికరాలు కూడా వీరు ఉచితంగా కొట్టేశారు. ఆ భవనాలకు చుట్టూ ప్రహరీగోడమాత్రం వీరు కట్టారట.

మొదటగా తెలుగుమీడియంలో ఎం. పి. సి., బైపిసి, వంటి కోర్సులు ప్రారంభిస్తున్నారు. తర్వాత వృత్తివిద్యను ప్రవేశపెడతారట.

కావలిలో ఒక మహిళా కళాశాల కొరత చాలాకాలంనుంచివుంది. అది ఇన్నాళ్లకు ఈ రూపంలోనైనా తీరినందుకు అందరూ సంతోషిస్తున్నారు.

నెల్లూరులో ఇటువంటి కళాలలు ఒకటి కాదు, మూడు నాలుగు ప్రారంభించాల్సిన అవసరంవుంది; అయినా ఎవరూ అపనికి పూనుకోవడంలేదు.

### పౌష్టికాహారం పంపిణీ

అగస్టు 15 సందర్భంగా చేర్మెన్ శ్రీ ప్రభాకరనాయుడు, డి ఎస్ పి శ్రీ సత్యనారాయణల ఆధ్వర్యంలో తెలుగు యువత నాయకుడు శ్రీ బి. రామకృష్ణ 40 మంది పిల్లలకు పౌష్టికాహారం పంచారు.

### ఐ ఎ ఎస్ కు ఎంపికైన కావలి యువకుడు

కావలి టౌనుకు చెందిన శ్రీ ఎం. రాజశేఖర్ (28) ఐ ఎ ఎస్ పరీక్షలలో 72 ర్యాంకులో ఉత్తీర్ణుడైనాడు. ఇటీవలే మరణించిన డాక్టర్ ఎం. జనార్దనం కుమారుడాయన. కావలి జి ప హైస్కూలు, జవహర్ భారతి కాలేజీలలో చదివి, తర్వాత బిటెక్‌పాసై ఉద్యోగం చేసుకుంటూ ప్రైవేటుగా కోచింగ్ తీసుకుని ఐ ఎ ఎస్ పరీక్షలకు హాజరైనాడట. కావలినుంచి ఐ ఎ ఎస్ కు సెలక్టయిన తొలి యువకుడితడేనని చెప్తున్నారు.

ఈ ప్రతిభావంతుడికి డి ఎస్ యు విద్యార్థులు ఒకసభపెట్టి, అభినందనలందజేశారు. మునిసిపల్ వైస్ ఛేర్మెన్ శ్రీ గ్రంథి యానాదిశెట్టి అధ్యక్షించారు; శ్రీ ఓరుగంటి లక్ష్మీనారాయణ, కె. రాధాకృష్ణమూర్తి, పి. వీరారెడ్డి తదితరులు మాట్లాడారు. విద్యార్థి నాయకుడు శ్రీ డేవిడ్ వందనాలు చెప్పారు.

## కావలి వార్తలు

—కొరవ 10 వపేజీలో

# నెల్లూరు నలుచెరగుల్లా

విహార్మకుడు

## సద్దుమణగిన బ్యాంకు అవిశ్వాసం రభస

హైకోర్టు ఆదేశాల ఫలితంగా కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు అవిశ్వాస తీర్మానం రభస ప్రస్తుతానికి సద్దుమణిగింది. కోర్టు ఆదేశాలకు ఎవరికితోచిన రీతిలో వారు వ్యాఖ్యానాలు చేసుకొని సంతృప్తిపడుతున్నారు.

చంద్రమోహనరెడ్డిచెప్పడం. ప్రభుత్వ చర్య సమంజసం కాదని కోర్టు వ్యాఖ్యానించిందని; ప్రభుత్వ వాదన విన్నతర్వాత నిర్ణయం ప్రకటిస్తుందని, అందువల్ల తాను మరొక ఏడాదిపాటు పదవిలో కొనసాగడం తథ్యమని అంటున్నాడు.

వివేకానందరెడ్డి అవిశ్వాస తీర్మానానికి ప్రభుత్వస్టేపోయి, పరోక్షంగా కోర్టు స్టే లభించిందని చెప్తున్నారు.

చంద్రమోహనరెడ్డి తన డైరెక్టర్లను విహారయాత్ర నుంచి వెనక్కు పిలిపించి వేశాడు. అవిశ్వాసతీర్మానం ఏమైపోయినా రామేశ్వరం, గోవా, కొల్హాపూర్, ఊటీ, బెంగుళూరు, బృందావన గార్డెన్స్, హళేబీడు, బేలూరుమఠం, కన్యాకుమారి వంటి ఉత్తర, దక్షిణ విహారక్షేత్రాలన్నీ తిరిగి వచ్చారట. అదృష్టవంతులు.

## నెల్లూరు మునిసిపాలిటీని కాంట్రాక్టర్లకు అమ్మేశారా

ఈ ప్రశ్న కొంచెం అతిగానే కన్పించవచ్చుగాని, మునిసిపాలిటీలో జరుగుతున్న తీరుచూస్తే అమాత్రం గట్టిగాఅడగడంలో తప్పులేదన్పిస్తూంది. టౌన్‌లో లక్షలాది రూపాయల ఖర్చుతో వేస్తున్న రోడ్లు చూడండి- కాంట్రాక్టర్లెంత బరితెగించిపోయింది చెప్పకనే అర్థమౌతుంది.

ఉన్న ఎస్టిమేషన్లనే తుంగలోతొక్కి-టాక్‌మాలిష్ పనులుచేసి బిల్లులు చేసుకునే ఈ కాంట్రాక్టర్లకు, ఎస్టిమేషన్‌కంటే ఐదు కాలం అధికరేట్లు ఇవ్వాలని ఇంజనీర్లు ప్రతిపాదించారట. మొన్న 22 తేది కౌన్సిల్ సమావేశంలో ఈవిషయం ప్రస్తావనకు వచ్చినప్పుడు సి పి ఎం కౌన్సిలర్ ఇది నిలువుదోపిడీ అని గొంతు చించుకుని అరిచినా, తెలుగుదేశం కౌన్సిలర్ శ్రీ శరత్చంద్రబాబుతోసహా అడుగడు కౌన్సిలర్లు వాకౌట్ చేసినా ఏమాత్రం లెక్క చేయక ఆ ప్రతిపాదనను ఆమోదించేశారు కాంట్రాక్టర్లు తెలుగుదేశం కౌన్సిలర్లతోపాటు, కాంగ్రెసీయులనుకూడా బోరున కొనుగోలు చేసినట్లున్నారు- ఇంత జరుగుతున్నా వారు నోరెత్తి మాట్లాడలేదు.

కాంట్రాక్టర్లు సిండికేట్‌గా ఏర్పడి, టెండర్ల సమయంలో రాజీచేసుకుని అధికశాతానికి టెండరువేస్తున్నారని; దాన్ని తిరస్కరిస్తే రీటెండర్లకు నాలుగునెల కాలయాపన జరగడమేకాక, మళ్ళీ అదే తంతు జరుగుతున్నదని, అందువల్ల పీటిని ఆమోదించినా బిల్లుల సమయంలో కోత కోస్తామని ఇందులో అవినీతి ఏమీలేదని ఛేర్మన్ వహాన శ్రీ పత్తి రవీంద్రబాబు మాకు వివరణ ఇచ్చాడు. చూద్దాం!

## జి. ప. సమావేశం

నెల్లూరు జిల్లాప్రజాపరిషత్ సమావేశం 18 తేది జరిగింది. తెలుగుదేశం వారులందరి వలెనే ఛేర్మన్ శ్రీ డేగా నారసింహారెడ్డికూడా 'జమీందారైతు' ను సమావేశానికి నిషేధించాడు. సమావేశంలో తమ అసందర్భ ప్రవర్తనను, ప్రేలాపనలను వున్నది వున్నట్లు ప్రచురిస్తున్నారనే కక్షతోటేఖ. ఏ పత్రికా విలేఖరులైతే తమకు నచ్చిన విషయాలే వ్రాస్తారని వారిఆశ. జి.ప్ర.ప. సమావేశానికి రానివ్వకుండా చేసినంత మాత్రాన 'జమీందారైతు'కు జరిగే నష్టమేమీ లేదు; పాలకుల కుత్సితబుద్ధి బయటపడుతుంది, అంతే.

ఈసమావేశంలో స్వతంత్రపార్టీ సభ్యుడు శ్రీ ఎం. వి. నారాయణరెడ్డి ఛేర్మెనారును ప్రశ్నాపరంపరలో ముంచెత్తినట్లున్నారు. ఛేర్మన్‌గారు అజెండా తదితర విషయాలలో తాను చేసింది తప్పేనని ఒప్పుకొని చెంపలేసుకున్నారట. ఈ పీడంతా ఎందుకనుకున్నాడేమో, తనకు అర్జంటుపని వుందనిచెప్పి అర్ధాంతరంగాలేచి వెళ్ళిపోయాడట. ఉపాధ్యక్షురాలుకూడా రాకపోయేసరికి, కాంగ్రెస్ ఎమ్మెల్యే శ్రీ కె. వి. సుబ్బారెడ్డి తాత్కాలిక అధ్యక్షుడైపోయాడు.

అడిగిన ప్రశ్నలన్నిండికీ ఒకటే జవాబు— నిధులు లేవు అని!

మాజీమంత్రి శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి, కావలి ఎమ్మెల్యే శ్రీ కలికి యానాదిరెడ్డి వరుసగా నాలుగు సమావేశాలకు రాకపోవడంతో వారి సభ్యత్వం రద్దయిపోయిందట. జిల్లాపరిషత్ మీటింగులకుకూడా రావడానికి తీరికలేనంత ప్రజాసేవ ఏమిచేస్తున్నారో మరి, వారిద్దరు!

## ఇందిరమ్మ రథం

పిసిసి సంయుక్త కార్యదర్శి శ్రీ వి

—కొరవ 7వ పేజీలో

# శివారెడ్డి పద్యాలు

### అమెరికా రైతు పౌరధి

ఈ అమెరికా రైతు అలోలల్లో
అక్కడ [illegible] నాకు ప్రతిదిరియును
పిల్లలేనాలక నీకు నిర్మాణమ్ము
నష్టపెంటలోను దాపురిల్లు!

అంత లోకగడపెకె నర్మదియ్యమ్ము
దానిప్పెయ్య నీవు చేసిదిని
ఆరాదారవస్తే చూడాలనిపించి
ఇదుగుడవికి అంత భాగ్యమంట!

### లేగుంటపాదు స్వాతంత్ర్యజండా

ఆ గ్రామమునకు స్వాతంత్ర్యజండాను
హైకియుగురవేసి ప్రస్వీదెంటు
ఇల్లయి, యింతకంటె భాగ్యమేదేలేదు
ఇదుగుడవికి యింకఇల్ల స్వర్గం!

### ఆచార్య మద్దూరు

అంపినాడ తాము అర్బాయి ఉరలేక
పెద్దపెల్లా దాచిపెట్టకేసి,
వృద్ధజంటువాన్ని, మద్దూరు! గుంటూరు
యిక్కడుండ పెద్దపక్క ప్రాబ్లమ్!

### కాటంరెడ్డి స్వరూప

అందచందముల్లో అమ్మాయి సౌభాగ్య
పతి స్వరూపవస్తు, ఎదురువస్తు,
వికటమనపలావు విందుమాహాత్మ్యమ్ము
విమిజెప్పుడు ఆకాశ వెల్లువనుకా!

### ప్రభంటు

రామరావుగార్లె రాజానాను అధికార
దాహమెక్కువైంది దానితోడు
ప్రభంటు యిరాకనంటు పదవమ్మురల్లరలోనె
దక్కలోదు ఎయటి చెప్పగాదు!

ఎప్పటికైనా యీ కవి
సెప్పే హితవాక్కైతే క్షేమము, లేదా
తప్పులుసప్పుడు, కాంగ్రెసు
ఎప్పుడుబుద్ధితెలా దానికెసుపెట్టావు!

### టీవీలో రాధాకృష్ణులు

రాధాకృష్ణుల స్వర్గము
మోహావేశానిలో కవిని ముంచితేల్చి, ఏ
మాటని పాటను కృష్ణుడు
రాధ యువతరముకు అకారణము సుమల్లా

బృందావనములో కృష్ణుడు
ఓండులేస్తువుంటె చుట్టుచేరి గోపికల్
మందలుమందలు, బ్రహ్మా
నంద మింతకంటెకలదె నన్నడిగినచో!

## పినాకినీ తీరం

(3వ పేజీ తరువాత)

మరూ పెద్దవాళ్లు సంపాయించిపెట్టిన ఆస్తులను ఎట్లా హారతికర్పూరంలా కరిగించివేసుకొంటుండినారో ఇప్పుడంత ఎక్కువగా కష్టపడుతున్నారు. పూరకమూర్పున్నా ఏనిమిదిరరాలకు సరిపోయేంత పోగ చేస్తున్నారు. కాంట్రాక్టులు, హోటళ్ళు, రియల్ ఎస్టేటు వ్యాపారాలు, చిత్రనిర్మాణాలు, పరిశ్రమలు, చదువులు వున్న తోర్యాగాలు ఒక్క చేమిటి అన్ని రంగాలలో ముందరుగుగా పోటాపోటీగా పడుగులు తీస్తున్నారు; ధనాఢ్యులలో ఎవరి బరువుఎంతో, ఎవరిఎత్తు ఎంతో తెలిసికోలేనంతగా ఎదిగిపోతున్నారు. పాతవాళ్ళేకాదు, ఈ పడుగు పందెంలో కొత్తవాళ్ళు సమవుద్దీలుగా సరితూగుతున్నారు. ఇండినుండి వృత్తదేశులతో దూరప్రదేశాలకుపోయి స్వయంకృషితో, స్వయంప్రతిభతో నిశ్శబ్దంగా వున్నత స్థితికివచ్చి హఠాత్తుగా ఒక్కరోజు తళుక్కున మెరుస్తున్నారు. పాతఅప్రభను తుడిచివేసుకోవడమేకాదు, కొత్తచరిత్రను సృష్టిస్తున్నారు.

మొన్న శ్రీ వై. మీరారెడ్డి నెలకొల్పిన కపర్ది పర్స్ ప్రారంభోత్సవ సభకు పోయి వచ్చాను నా మనసులో ఏ పాత కొత్త దృశ్యాలు మెదిలాయి. ఆ ఆనందాను భూతికి అక్షరరూపమే ఈ నాలుగుమాటలు. గౌరవ దురుకుదనం, నేర్పు నైపుణ్యం, నిగర్వత నిరాడంబరత, కాలానుగుణమైన వ్యాపార మెళకువలు, గ్రామీణ జీవితం... వీటన్నిటి సమ్మేళన సమగ్ర స్వరూపమే మీరారెడ్డి. ఈనాడు జిల్లాలో మనకు పందలాదిమంది మీరారెడ్లు ఎదురవులారు. కుల మత అంతస్తులకు అతీతంగా అటువంటి యువకులను చూచినపుడు పరమానందం కలుగుతుంది. బంగారానికి తావి అన్నట్లు, సంపన్నతకు ప్రజోపకారతత్వం తోడైతే సార్థకంగా వుంటుంది.

### దోపిడిదారులు

తెలుగు దళారులు, తెలుగు దోపిడిదాల ఎక్కువగానేవుంది.ఎక్కువేమిటి అది, కార అనధికార్లలో అది విచ్చలవిడి అయిపోయింది. భయము భక్తి, జంకుగొంకు, లజ్జాగిజ్జ, మొగమోటం గిగమోటం ఏమీ లేదు... నీతిమాలిన తనం దినమొలతో వీధుల్లో చిందులేస్తూంది.

ఎవరనిచెప్పడం? ఎన్నవిఏకరువు పెట్టడం? నెల్లూరులో పదవిలోవున్న తనఅల్లుని అండజూచుకొని, ఆతనిపేరు చెప్పుకొని చిన్న కంట్రాక్టరుగావుండిన ఒకరెడ్డిగారు పెద్ద'కలెక్టరు'గా డబ్బు జోరుగా జవురుతున్నాడనిగోలగావుంది.ఒక్కడిపార్టుమెంటని లేదు, ఒక్క అధికారిఅనిలేదు. అన్నిశాఖలను అందరు అధికార్లను జలగలవలె తగులుకొంటున్నాడట; నయానచేయకుంటే బెదిరించి అదుగుతున్నాడట; నేడుగా ముఖ్యమంత్రితోచెప్తానని బెదరిస్తున్నాడట; పనులు చేసిపెడతానని దండకాలు జడుపుతున్నాడట. నీతినియమాలు వదిలేసిన ఒక పెద్ద మంత్రి కూడా ఇంత పీడింపుగా వేధింపుగా వుండదంటున్నారు. ఇతని జబర్దస్తీకి అందరూ విస్తుపోతున్నారు. ఇతనికి ఆ అధికారం ఎవరిచ్చారు, ఎక్కడనుండి వచ్చింది అని ఆశ్చర్యపడుతున్నారు. విచక్షణారహితమైన ఇతని దోపిడి పదవిలోవున్న ఆ యువకుడి భవిష్యత్తును నాశనంచేస్తుంది.

ఎవరావ్యక్తి, ఏమిటాకథ అని అడుగుతారా. అతను తనపద్ధతి మార్చుకోకుంటే అప్పుడు చూద్దాం!

### సభ్యతకాదు

ఇటీవల నేను పాల్గొన్న ఒక సభలో అందివ్వబడినకవితాకల్హారమాలికను తీరిగ్గా ఇంటివద్ద చదువుకుంటే నాకనిపించింది- పొగడ్తలకు, ఉత్ప్రేక్షలకు, అలంకారాలకు ఔచిత్యమనేది లేదా? ఏ వ్యక్తిని గూర్చి ప్రశంసావాక్యాలు వలికారో ఆవ్యక్తికైనా దరిదాపుగా తాను వాటికి అర్హుడనే అభిప్రాయం కలుగవలసిన అవసరంలేదా? పొగడ్తలు సహజంగా, నిజానికి దగ్గరగావుంటే ఇంపుసొంపుగాని, ప్రశంసలకు పాత్రమైన వ్యక్తికే ఎబ్బెట్టుగాతోచి ఇబ్బందిపడేట్లుగా వుంటే అది ఎవరికి గౌరవం? అనిపించింది. వైతాళికుడు... ఈ గడ్డ దొడ్డపేరు నిలబెట్టిన... విశ్వంఏమిటి విశ్వాంతరాళం... అవార్డులేవాడు...

ఈ మాటలు మీకెట్లావున్నాయోగాని నాకు తిక్కను కల్గిస్తున్నాయి. కాని నాకూ గౌరవభావంగల ఒక వ్యక్తినిగూర్చి, నా కంటే అనుభవజ్ఞుడు సమర్థుడు అధికుడు అయిన ఒక జర్నలిస్టునుగూర్చి, నాకూ పాత్రవున్న ఆ సభావిశాన్నిగూర్చి నేనే వ్యాఖ్యానించడం సభ్యతకాదని నాకు నేనే బుద్ధిచెప్పుకొని, నాకలం దాపల్లానికి నన్ను క్షమించమని కోరుతున్నాను.



## కాంగ్రెస్‌కు ప్రమాదమే

(1వ పేజీ తరువాత)

ఎవరైతే మేలు అని అడిగితే, 58 శాతం రాజీవ్‌గాంధీనే వరించారు. వి పి సింగ్‌కు వచ్చింది 37 శాతం ఓట్లే. రామకృష్ణ హెగ్డేతో పోల్చినప్పుడు 67 శాతం మంది, జ్యోతిబసు ప్రక్కన నిలబెట్టినప్పుడు 60 శాతం ప్రజలు రాజీవ్‌గాంధీయే ప్రధానిత్వానికి అర్హుడు అని తేల్చి చెప్పారు.

రాజీవ్‌కాక ఇంకెవరైతే మేలన్నప్పుడు మాత్రం 63 శాతం ఓట్లు వి పి సింగ్‌కు పోలైనాయి. పాపం ప్రధానిత్వానికి ఎగిరెగిరి పడుతున్న మన ఎన్టీ రామారావును 85 శాతం మంది ప్రధానిత్వానికి అనర్హుడని తిరస్కరించారు. దక్షిణాదిలోకూడా ఆయనకు 27 శాతం ఓట్లు పడితే, వి పి సింగ్ 42 శాతం ఓట్లు తెచ్చుకున్నారు.

ప్రధానిగా రాజీవ్ పనితీరు ఎట్లావుంది అని అడిగితే, 38 శాతం మెచ్చుకున్నారు, 33 శాతం ఫర్వాలేదన్నారు; 29 శాతం మాత్రం పెదవి విరిచారు.

ఇంకొక విచిత్రమేమిటంటే బోఫోర్సు, ఫెయిర్‌ఫాక్స్ వంటి సవాలక్ష కుంభకోణాలు వెలికివచ్చిన తర్వాతకూడా దేశంలో 50 శాతం మంది ప్రజలు వి. పి. సింగ్ కంటే రాజీవ్‌గాంధీనే నిజాయితీపరుడని విశ్వసిస్తున్నారు. 57 శాతంమంది ఆయన కంటే రాజీవ్ పరిపాలనాదక్షుడని మెచ్చుకుంటున్నారు. 58 శాతం మంది రాజీవ్ గాంధీ, వి. పి. సింగ్ కంటే అధికంగా పేదల పక్షపాతిఅని తేల్చిచెప్తే, 57శాతం మంది ఆయన ఈయనకంటే స్పష్టమైన విధాలు కల్గిన, నిలకడ కల్గినవాడని నమ్ముతున్నారు. మొత్తంమీద ప్రధానిగా, రాజకీయ నాయకుడిగా, పార్టీ అధినేతగా ఏ కోణంనుంచి చూసినప్పటికీ వి. పి. సింగ్ రాజీవ్‌గాంధీ వలె ప్రజాభిమానం పొందలేకపోతున్నారు.

దానికంటే విచారించదగిన విషయమేమిటంటే దేశంలో 66 శాతంమంది ప్రజలకు అసలు జనమోర్చా అంటే ఏమిటో ఎవరిదోకూడా తెలియదట. ఎంతో ఆర్భాటంగా, అట్టహాసంగా, అంతర్జాతీయ పత్రికలలోకూడా విశేష ప్రాచుర్యంతో వి. పి. సింగ్ అలహాబాద్ ఎన్నికలలో విజయం సాధించిన విషయం 82 శాతంమంది భారతీయ మహిళలకు తెలియదంటే తెలియదు. అసలా ఎన్నికలో విజేత ఎవరో తమకు తెలియదని 74 శాతం మంది గ్రామీణ ఓటర్లు, 49 శాతంమంది పట్టణ ఓటర్లు తెల్లముఖం పెట్టారు.

ప్రతిపక్షాలు కలిసి, ఒకటిగా తమ దగ్గరకు వస్తే ఓట్లేసి గెల్పించి, అధికారంలో నిలబెడతామని వాగ్దానం చేస్తున్న ఈ ప్రజలలోనే, అసలు ప్రతిపక్షాలు కలిసి వుంటాయన్న నమ్మకంలేదు. వి పి సింగ్ ప్రభావం దట్టంగావుండే ఉత్తరాది రాష్ట్రాలలోకూడా 62 శాతం మంది ఈ కలయిక కొనసాగా నిలవదని గట్టిగా నమ్ముతున్నారు. దేశం మొత్తంమీద 65 శాతం మంది ప్రతిపక్షాల ఐక్యతాయత్నాలు ఫార్సేనని తేల్చిపారేశారు.

ఇదీ పరిస్థితి!

## సింహపురి

(4వ పేజీ తరువాత)

వాద్యాలేకాదు, కురిపించబడిన పూలజల్లులు ఆయనకు దారికనబడకుండా పొరకప్పినట్లుగా వుడ్డాయి. ఎన్నులవిందు చేస్తుండిన లైల్లకాంతిని మిరుమిట్లుకరంగపరచింది.

సంస్థ మేనేజరు శ్రీ సుబ్బారావు ప్రత్యేకంగా చక్కని ఏర్పాట్లు చేశారు.

### వర్ధమాన సమాజం ఎన్నికలు

వర్ధమానసమాజం కార్యవర్గ ఎన్నికలు సెప్టెంబరు 19 తేది జరుగుతాయట. చందాలు చెల్లించని సభ్యులు ఈ నెలాఖరులోగా లైబ్రేరియన్ దగ్గర కట్టేయాలట. అగస్త్యరెడ్డి వెంకురెడ్డిగారు చెప్తున్నారు.

### విశ్వహిందూపరిషత్

విశ్వహిందూ పరిషత్ నెల్లూరు టౌన్ కమిటీకి శ్రీ ఎర్లపల్లి గోవిందు శెట్టి గౌరవ అధ్యక్షుడుగా ఎంపికైనారు. అధ్యక్షుడుగా డాక్టర్ జి. చలమయ్య, కార్యదర్శిగా శ్రీ సూరిశెట్టివెంకయ్య, సంయుక్తకార్యదర్శిగా శ్రీ వి. పార్థసారథి, కోశాధికారిగా శ్రీ అనుమలశెట్టి హరినారాయణ ఎన్నికైనారు. ఉపాధ్యక్షులు, సహకార్యదర్శులు, ఇతర సభ్యులజాబితాకొంతపీటబాటడంత వుంది.

రంగడి బంగారు గరుడ వాహనాన్ని తక్షణం రిపేరుచేయించాలని పరిషత్ కోరింది. ఈ వాహనం పెంచలకోన అగ్నిప్రమాదంలో సర్వనాశనమైపోయింది. అప్పటినుంచి దాని రిపేరుకు తలపెట్టినవాడే లేకుండాపోయాడు.

### గృహనిర్మాణంలో కొత్తపద్ధతులు

రాష్ట్ర గృహనిర్మాణ సంస్థకు చెందిన ప్రాంతీయ హౌసింగ్ డెవలప్‌మెంట్ సెంటర్‌వారు ప్రాంతీయ సాంకేతిక వర్క్‌షాప్, సెమినార్‌ను ఇటీవల కస్తూరిబా కళాక్షేత్రంలో నిర్వహించారు. హౌసింగ్ డెవలప్‌మెంట్ సెంటర్ సివిల్ ఇంజనీరు శ్రీ పి. ఎస్. శాస్త్రి వర్క్‌షాప్ ముఖ్య ఉద్దేశాలను వివరించారు. గృహనిర్మాణాన్ని ఎక్కువ సులభతరం, త్వరితం, ఆధునికంచేసేపద్ధతులు రూపొందించి, తరువాత 30 మంది యువకులకు రోజువారి 30 రూపాయలవేతనంతో శిక్షణ ఇస్తామని, ఈ పద్ధతిని జిల్లాలో కొత్తగా ప్రవేశపెడుతున్నామని ఆయనన్నారు. హౌసింగ్ కార్పొరేషన్ జిల్లా మేనేజరు శ్రీ పి. రవిప్రకాష్ స్వాగతించారు. డిప్యూటి ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు శ్రీ ఎస్. ఎం. ఎ. కె. అజాద్ వందనసమర్పణ చేశారు. ★

27 తేది శనివారం శ్రావణ పూర్ణిమ

### ముహూర్తములు

27 తేది శనివారం రాత్రి 11-45 గంటలకు వృషభలగ్నమున వివాహ, గృహప్రవేశములకు.

29 తేది సోమవారం ఉదయం 10-26 గంటలకు తులా లగ్నమున వ్యాపార ప్రారంభ, శంకుస్థాపనలకు.

31 తేది బుధవారం ఉదయం 9-35 గంటలకు తులా లగ్నమున వ్యాపార ప్రారంభ, ఉపనయన, వివాహ, శంకుస్థాపనలకు శుభముహూర్తములు.

### పుబ్బకార్తె

30 తేది పుబ్బ కార్తె ప్రారంభము. 29, 30, 2 తేదీలు మనప్రాంతమునకు వర్షసూచన.

### అగస్టు తిథులు

| | | | |
|---|---|---|---|
| 27 శని | పూర్ణిమ | సా. 4-58 | గం. వ. |
| 28 ఆది | పాడ్యమి | సా. 2-45 | గం. వ. |
| 29 సోమ | విదియ | ప. 12-00 | గం. వ. |
| 30 మంగళ | తదియ | ఉ. 9-45 | గం. వ. |
| 31 బుధ | చతుర్థి | ఉ. 7-27 | గం. వ. |

తరువాత పంచమి పూర్తి

### సెప్టెంబరు తిథులు

| | | | |
|---|---|---|---|
| 1 గురు | షష్ఠి | రా. 3-40 | గం. వ. |
| 2 శుక్ర | సప్తమి | రా. 2-15 | గం. వ. |

—స్వయంపాకం శ్రీనివాసులు ఎం. ఏ.



''స్వాతిచినుకులు'' సెట్లో వాణిశ్రీ జన్మదినోత్సవం. కుడివైపున ఆమె కుమార్తె. వెనుక వైపున ఆమె భర్త, నటులు కాంతారావు, రమ్యకృష్ణ ఇతరులు.

# ఎన్టీఆర్ 'విశ్వామిత్ర'కు కృష్ణ 'అవినీతి చక్రవర్తి' పోటీ

మళ్ళీ ఎన్. టి. ఆర్. 'బ్రహ్మర్షి విశ్వామిత్ర' చిత్రంతో దృష్టి మర ల్చారు. జాతీయ ఫ్రంట్ అధ్యక్షుడుగా వుంటూ, ముఖ్యమంత్రిగా వుంటూనే ఈ చిత్రాన్ని ఎలా రూపొందిస్తారోగాని పార్ల మెంట్ ఎన్నికలదృష్ట్యా 1989 ఆగస్టులో విడుదలచేయడానికి నిశ్చయించారట.

అదే సందర్భంలో హీరో కృష్ణ జాన యు. సూర్యనారాయణబాబు ''అవినీతి చక్రవర్తి'' అనే రాజకీయ వ్యంగ్య చిత్రాన్ని విడుదలచేయడానికి సన్నాహాలు చేస్తున్నారు. ఇందులో కృష్ణ హీరో.

ఏచిత్రం ఎవరికంగా ప్రేక్షకులను ఆకర్షిస్తుందో అప్పటి పరిస్థితులనుబట్టి వుంటుంది.

## మద్రాసు సినిమా వార్తలు

### సుమన్‌మీద కేసులు కొట్టివేత

బీనా (22), ఆమె అక్క సునీత (24) 21-4-86 న మద్రాసు అశోక్‌నగర్‌లోని ఒక సినిమా థియేటర్‌వద్ద నిలుచునుండగా సుమన్ కారుఆపి, వాళ్ళను వాళ్ళ ఇళ్ళలో దిగబెడ్తానని చెప్పి, కారులో ఎక్కించుకుని, బలాత్కారం చేయబోయినట్లు పోలీసులకు ఫిర్యాదు చేశారు. ఇంటికి వెళ్లి సబ్బులు విక్రయించే సీత (21) లక్ష్మి (23) లకు సినిమాలలో ఛాన్సులిప్పిస్తానని ఆ పెద్ద కూల్‌డ్రింక్‌లో మత్తు మందు కలిపి, నగ్నంగా ఫోటోలు తీసినట్లు ఫిర్యాదు చేశారు. 18-6-86న సుమన్ ఖైదు చేయబడ్డారు. 4 నెలల తర్వాత 1-10.86 న చెంగల్పట్టులోనే ఉండాలన్న నిబంధనమీద విడుదలచేయబడ్డారు. అగస్ట్

—కొరవ 11 వ పేజీలో

# ఒక్కటుండే ఒక్కనెలలో ఏడుచిత్రాల విడుదల- వంద పేర్లు రిజిష్టరు

ప్రాణస్నేహితులు, పెళ్ళిచేసిచూడు, ఓ భార్య కథ, రాముడు-భీముడు, అన్నా చెల్లెలు, జీవనగంగ, జీవనజ్యోతి వగైరా చిత్రాలతోపాటు ఎన్నో డబ్బింగ్ చిత్రాలు కూడా సెప్టెంబర్‌లో విడుదలకానున్నాయి. వీటిలో ఏ రెండో మూడో తప్ప తతిమావి కానుగోలుదారులను ముంచేవే అని పరిశ్రమలోని పలువురి అభిప్రాయం.

### రిజిస్టర్ చేయబడిన కొన్ని కొత్త చిత్రాల పేర్లు

ఎస్. కె. ఆర్ట్స్: మిస్టర్ రామారావ్,

> ఏమైపోతుందో
> మన తెలుగు
> సినీ పరిశ్రమ

శ్రీ వెంకటేశ్వరా ఆర్ట్ ప్రొడక్షన్స్: కాలకృష్ణుడు, పద్మావతి ఫిలిమ్స్: ఇదే ఇంటిల్లిపాదీ చూడదగ్గ సినిమా, విజయమాధవి కంబైన్స్: కదలండు-పదలండు, లక్ష్మి ప్రొడక్షన్స్: మహిళలు మహారాణులు, అశ్విని ఆర్ట్ క్రియేషన్స్: నా పెళ్ళాం నాఇష్టం, మహేశ్వరి పరమేశ్వరి ప్రొడక్షన్స్: స్టేట్‌రౌడీ, శశాంక ఆర్ట్స్: తాతయ్య పెళ్లి మనవడి శోభనం, అమృతాఫిలిమ్స్: యుద్ధకాండ, ఓం శ్రీ శక్తి వినాయక ఎంటర్‌ప్రైజెస్: వంశోద్ధారకుడు, దమయంతిఆర్ట్ ప్రొడక్షన్స్: త్రినేత్రుడు, శ్రీ ప్రభుపాదవాణి: శ్రీకృష్ణలీలలు, శ్రీ జయలక్ష్మి ఎంటర్‌ప్రైజెస్: సూపర్ సుప్రీమ్, అరుణోదయ ఆర్ట్ పిక్చర్స్: సింహంలాంటి మనిషి, రాజేశ్వరి ఫిలిమ్స్: ప్రేమ, నాగార్జున ఫిలిమ్ మేకర్స్: పెళ్ళికొప్పులు, ఓం శ్రీ శక్తి వినాయక ఎంటర్‌ప్రైజెస్: పసుపు-కుంకుమ, ఉషామూవీస్: నెత్తురుదీపం, విశ్వామిత్ర క్రియేషన్స్: నాతిచరామి, అంజననాగ వేలాంగణి కంబైన్స్: నాగ పౌర్ణమి, సంతోష్ ఆర్ట్ పిక్చర్స్: మృత్యుముఖం, క్లయిమ్స్ ఇండియా లిమిటెడ్: మీరేచెప్పండి, మిఠాయి మూవీస్: మరో పోరాటం, విజ్ఞానవివేక ప్రొడక్షన్స్: మార్చండి ఈ చరిత్ర, శ్రీ దత్తసాయి క్రియేషన్స్: మనిషి, ఎవర్‌గ్రీన్ ఆర్ట్ పిక్చర్స్: కుంకుమరేఖ, సౌదామిని క్రియేషన్స్: ఖైదీ నెం. 1, పల్లవి సినీ కంబైన్స్: డాకీ చరణ్, లీలామూవీస్: హరహర మహాదేవ, శ్రీ విజయలక్ష్మి ఆర్ట్ ప్రొడక్షన్స్: మరానాగూండా, గాంధారాజ్యం, గోపీకృష్ణా ఎంటర్‌ప్రైజెస్: గండర గండడు, గుడివాడ ఫిలిమ్స్: ఎవరుదొంగ, జయలక్ష్మి సినీ కంబైన్స్: ఆనాటి చింతామణి, క్లయిమ్స్ ఇండియా లిమిటెడ్: డాక్టర్ హీరో, శ్రీ ఉషా ఆర్ట్ ప్రొడక్షన్స్: ధృవనక్షత్రం, ధృవతార, విజ్ఞాన వివేక ప్రొడక్షన్స్: దేశం నాకేం చేసింది, శ్రీ

-కొరవ 11వ పేజీలో

## జిల్లావార్తలు (6వ పేజీ తరువాత)

అసెంబ్లీలోకిగా ప్రవేశించడమేకాని, పేదవాళ్ళ పట్టాల స్వాధీనం కాల అటుం దరగా వుంటున్నది. ఒక్కచోటనే ఎ.టి.రి పేటలోనే పట్టాలు స్వాధీనం కూడా జరుగుతున్నది. ప్రభుత్వమూలే ఈ అన్యాయాలకు తగినదుండు!

### గోర్బచేవ్ మీద

### నెల్లూరు సి. పి. ఎం. ధ్వజం!

20, 21 తేదీలలో నెల్లూరులో జరిగిన సి. పి. ఎం. డివిజన్ మహాసభలో పార్టీ జిల్లా కార్యదర్శి, శాసనసభ్యుడు శ్రీ జక్కా వెంకయ్య రష్యా అధిపతి గోర్బచేవ మీద ధ్వజమెత్తారు. గోర్బచేవ్ స్టాలిన్‌ను విమర్శిస్తూ ప్రవేశపెట్టిన విధానాలు కాలం చెల్లిన క్రుశ్చేవ్‌ఇజానికి ప్రాణంపోయడమే నని వెంకయ్యగారన్నారు. పెట్టుబడిదారీ దేశాలలో, బూర్జువా పార్టీలలోకూడా లేని దర్పణవాదిని విమర్శించే సాంప్రదాయం రష్యాలో రావడం విడ్డూరమన్నారు.

డివిజన్‌లో పార్టీ బలం పుంజుకున్నదని సంతృప్తివడుతూ, ఆ బలాన్ని ఇంకా పెంచుకోవాలని మహాసభ నిర్ణయించింది. శ్రీ డి. రమణయ్య, శ్రీ బి. వి. భానుమూర్తి వుపన్యసించారు. రమణయ్య కార్యదర్శిగా తిరిగి ఎన్నికైనారు. కృష్ణపట్నం రేవును అభివృద్ధి చేయాలని, అర్ధాంతరంగా వెయ్యిమెగావాట్ల సూపర్ థర్మల్ విద్యుత్ కేంద్రాన్ని నెలకొల్పాలని ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించారు.

### గూడూరు చోరీకాదు

### పడారుపల్లి చోరీ!

మొన్న 6 తేది సంచికలో గూడూరులో చోరీ అన్నవార్తలో దొంగతనం జరిగింది గూడూరులో కాదంటున్నారు చోరీ బాధితుడు పెయ్యాల రమణయ్య. దొంగతనం జరిగింది నెల్లూరు పడారుపల్లిలోని తన నివాసంలో అంటున్నారాయన. నెల్లూరు పోలీసుకు ఫిర్యాదుచేసినా కిమ్మనడంలేదని; విచారించి తన సొమ్ము తనకిప్పించాలని కోరుతున్నారు.

### దుత్తలూరు

### ఆంధ్రా బ్యాంక్

దుత్తలూరు ఆంధ్రా బ్యాంక్‌ను పాత భవనంనుండి, అనేక సౌకర్యాంగల విశాలమైన కొత్త భవనానికి మొన్న 17 తేది మార్చారు. ఈ సందర్భంగా చిన్నసభ; బ్యాంకు రీజనల్ మేనేజరు శ్రీ జె. ఎస్. శాస్త్రి అధ్యక్షించారు. శ్రీ అనిల్‌కుమార్ పచనాలు చెల్లించారు.

### తురిమెర్ల పశువుల

### కరెంటు చావు

సైదాపురం మండలం తురిమెర్ల కరెంటు మహాత్ముల పుణ్యమా అని పేద రైతులకు చెందిన నోరూ వాయీ లేని ఆరు బర్రెలు దిక్కుమాలి కున్నాయి. 16 తేది సాయంకాలం పెనుగాలి తురిమెర్లను ఒక వూపు వూపింది. గాలికి కరెంటు తీగెలు టపటప మని తెగిపడిపోయినాయి; వాటిని పట్టించుకున్న దిక్కూ, పైకిలేపి స్తంభాలకు కట్టిన నాథుడూలేడు. మేతకుపోయి ఆ దోవన వస్తుండిన ఆరు బర్రెలు కాళ్ళకు కరెంటు తీగెలు తగిలి చచ్చినాయి. వీటి విలువ ఆరువేల రూపాయలు. ఆ రైతుల గోడు పట్టించుకున్నవారేలేరు.

కరెంటు తీగెలను ఇంత నిర్లక్ష్యంగా వదిలేశారే, అదే మనుషులకే తగిలితే, ఏమయ్యేది? అయినా ప్రజలగోడు ఎవరికి కావాలి?

### ఆగస్ట్ 15

ఈ క్రింది గ్రామాలలో స్వాతంత్ర్య దినోత్సవం వైభవంగా జరిగింది—

వరికుంటపాడు: మండల ప్రజాపరిషత్ అధ్యక్షురాలు శ్రీమతి సుంకర నాగేశ్వరి ఉన్నత పాఠశాల, మండల కార్యాలయం, పంచాయతీ కార్యాలయాల్లో జాతీయ పతాకాన్ని ఎగురవేశారు. శ్రీ సుంకర హనుమంతరావు, శ్రీ యస్. పుల్లయ్య మాట్లాడారు.

* * *

సౌత్‌మోపూరు: వాణిశ్రీ జిల్లా ప్రజాపరిషత్ ఉన్నతపాఠశాలలో హెడ్మాస్టరు శ్రీ లక్కాకుల రామకృష్ణయ్య జెండాఎగురవేశారు.

* * *

ముత్తుకూరు: మండల ప్రజాపరిషత్ అధ్యక్షుడు శ్రీ వేమారెడ్డి వెంకటకృష్ణారెడ్డి మండల కార్యాలయం, సమితి కార్యాలయం, పోలీసుస్టేషన్ పాఠశాలల్లో జాతీయ పతాకాన్ని ఆవిష్కరించారు. మండల అభివృద్ధి అధికారి శ్రీ యస్. వి. సుబ్బారావు కూడా ప్రసంగించారు.

* * *

మర్రిపాడు: మండల వవోదయ పాఠశాలలో ఉదయగిరి నియోజకవర్గ శాసనసభ్యుడు శ్రీ యం. రాజమోహన్ రెడ్డి జాతీయజండా ఎగురేశారు. మండలాధ్యక్షుడు శ్రీ యం. వి. నారాయణరెడ్డి పాల్గొన్నారు. ప్రిన్సిపాలు వందన సమర్పణ చేశారు.

మర్రిపాడు మండల కార్యాలయంలో మండల ఉపాధ్యక్షుడు శ్రీ దొరసాల కృష్ణారెడ్డి పతాకావిష్కరణచేశారు. చిలకపాడు, ఎగళ్ళపాడు పాఠశాలల్లో మండలాధ్యక్షుడు శ్రీ నారాయణరెడ్డి జండా ఎగరేశారు.

★

## కావలి వార్తలు

(6వ పేజీ తరువాత)

### కావలి వనమహోత్సవం

కావలి జీడిమామిడి పరిశోధనాస్థానంలో 16 తేది వనమహోత్సవం జరిగింది. వ్యవసాయ విశ్వవిద్యాలయం దక్షిణ మండల అసోసియేట్ డైరెక్టరు డాక్టరు ఎం. వి. రెడ్డి పరిశోధనాస్థానంలో నత్రజని స్థాపక వర్గానికి చెందిన చింతమొక్కను నాటి, చెట్లను పెంచవలసిన అవసరాన్నిగూర్చి సవివరంగా వుపన్యసించారు. పచ్చనిచెట్టు పసిడిబంగారంతో సమానమని శ్రీ ఎం. వి. రెడ్డి అన్నారు.

పరిశోధనాస్థానం శాస్త్రవేత్త డాక్టర్ ఎస్. రత్నాకరరెడ్డి నత్రజని స్థాపక చెట్లను గూర్చి మాట్లాడారు. సిండికేట్ బ్యాంకి మేనేజరు సుబ్బారావు, ఫీల్డు ఆఫీసరు పెద్దిరాజు, న్యాయవాది దశరథరామయ్య ప్రభృతులు వుపన్యసించారు. ★

## జనవాణి

(8వ పేజీ తరువాత)

కళాశాల మూలంగా వెయ్యిమందికిపైగా విద్యార్థులు విద్యాసంవత్సరం నష్టపోతున్నారు. ప్రభుత్వం కళ్ళుతెరవకపోతే విద్యార్థులు ఆందోళన చేస్తారు.

నెల్లూరు -డి. పెంచలరావు

### సినిమా టిక్కెట్లు

నెల్లూరు టౌనులో సినిమా టిక్కెట్ల రేట్లు మరీ నింగినంటుతున్నాయి. కనీసం మునుపటిరేట్లకే మళ్ళీ తగ్గిస్తే ప్రజలకు మేలు.

నెల్లూరు -ఆర్. సుశీల

### కుక్కల బెడద

టౌనులో వీధికుక్కల బెడద జాస్తిగా వుంది. వీధి లైట్లు లేని సందుగొందుల్లో నడవాలంటేనే భయంగావుంది. మున్సిపాల్టీ వారు కుక్కలుపట్టేపని మళ్ళీ ప్రారంభించాలి.

నెల్లూరు —ఆలూరి అక్కానందం.

### తిరగబడ్డ జెండా!

మొన్న స్వాతంత్ర్య దినాన వి. ఆర్. లా కాలేజి భవనంమీద జాతీయజెండా తిరగేసి ఆవిష్కరించి వుంచింది. చూడలుచూసి అహా! ఏమి దేశభక్తి అని మురిసిపోవల్సి వచ్చింది. జాతీయజెండా ఎట్లా వుంటుందో కూడా తెలియని విద్యాధికులు, నాయకులు వున్నందుకు మనం గర్వపడాలి.

కలిగిరి -ఎస్. మహబూబ్‌బాషా

★

# తెలుగు పేరును భ్రష్టు పట్టించిన 'మా తెలుగు తల్లి'

చిత్రసమీక్ష
గ్రిద్దలూరు గోపాలరావు

"మా తెలుగుతల్లి", ఈ పేరులో ఎంతో కమ్మదనం నిండివుంది. ఎంతో సౌంపు వుంచివుంది. తెలుగువారి సర్వం ఈ పేరులో ఇమిడివుంది. తెలుగువారి గర్వం ఈ పేరులో పొదగబడివుంది. మా తెలుగుతల్లికి మల్లెపూదండ అన్న ప్రార్థన వుంచుతోంది. ఇంత గౌరవప్రదమైన, గణనీయమైన పేరుతో సినిమా తీస్తున్నవారు ఆ స్థాయిని నిలబెట్టగలిగి వుండాలి.

కథ, మాటలు, స్క్రీన్ ప్లే, దర్శకత్వం, రెండు పాత్రల పోషణబాధ్యత వహించి "మా తెలుగుతల్లి" చిత్రాన్ని రూపొందించిన పరుచూరి బ్రదర్సు నటపవిత్రమైన పేరును అన్నివిధాలా కించపరిచారని చెప్పాలి. తెలుగుతల్లిని భ్రష్టుపట్టించారని చెప్పకతప్పదు.

తెలుగుతల్లిని అన్నపూర్ణమ్మ (శారద) పాత్రలో ప్రతిబింబింపదలచుకున్నారు పరుచూరి బ్రదర్సు. కాని ఆ పాత్రలో ఎక్కడా తేజం కనిపించదు. ఆపాత్రను నడిపినవిధానం రోతగా వుంది.

కథగా చెప్పుకోదగింది చిత్రంలో ఏమీ లేదు. ఈనాడు సమాజంలో వీరవిహారం చేస్తున్న సమస్యలన్నిటినీ ఏరి ఇందులో చూపారు. ఇందులో చూపని సమస్యంటూ వేరేలేదు. ఈ సమస్యలన్నీ ఇదివరకు ఎన్నోచిత్రాల్లో చూచినవే. ఈ పాత సమస్యలను కాస్తయినా కొత్తపంథాలోచూపుదామన్న ప్రయత్నం ఎందునా జరగలేదు. అందువల్ల చిత్రం ముఖం మొత్తినట్టుగా వుంది.

మద్యపానం, మానభంగాలు, నిరుద్యోగం, నిరుపేదల ఆకలి, కార్మికుల కష్టాలు, తీవ్రవాదం, మాదకద్రవ్యాల స్మగ్లింగ్, పగ, ప్రతీకారం, హత్యలు, విప్లవం, రక్తపాతం, దిగజారిన న్యాయవ్యవస్థ, అమ్ముడుపోయిన రక్షకవిభాగం, రాజకీయనాయకులు ఇలా ఒకటేమిటి రకరకాల సమస్యలను చొప్పించారు. ఇక ఈ సమస్యలన్నిటికి సంబంధించిన పాత్రలసంఖ్య చాలాఎక్కువే. లెక్కలేనన్ని సమస్యలతో పాత్రలతో నిండిన ఈ చిత్రం గరుడసేవ జనం తొక్కిడిలా అనిపిస్తుంది. ఇన్ని సమస్యలకు పరిష్కారమార్గం చూపటంలోని అస్తవ్యస్తంవల్ల, ఎన్నో పాత్రలను నడపటంలోని అవకతవకలవల్ల చిత్రమంతా గందరగోళంగా తయారైంది.

ఈ సమస్యలన్నీగాక మరోసమస్యను చిత్రం చివరన వినిపించారు. భూసంస్కరణలు అమల్లోకివచ్చినప్పుడు భూస్వాములు కొందరు, బినామీపేర్లతో మిగులుభూములు ఇతరులకు బదిలీచేశారు. 1988 మే 12 న భారత రాష్ట్రపతి జారీచేసిన ఆర్డినెన్సు ప్రకారం బినామీపేర్లతో భూములుపొందిన వారు తిరిగి ఆ భూమిని భూస్వాములకు ఇవ్వనక్కరలేదు అన్నవిషయాన్ని చిత్రం ముగింపులో నేపథ్యంలో చెప్పించారు. కాని ఈ సమస్య చిత్రంలో కనిపించదు.

ఇన్ని సమస్యలను, అందులోనూ చాలా పాతబడిపోయినవాటిని ఒకే చిత్రంలో చూపాలనుకోవటం తెలివితక్కువ. ఆ సమస్యలను సరిగాచూపలేకపోవటం, వాటికి పరిష్కారమార్గం కనుపరచకపోవటం మరీ తెలివితక్కువ. ఏ సన్నివేశంలోను వాస్తవికత కనిపించదు.

అన్నపూర్ణ అనేఆమె (శారద) అన్నపూర్ణా మెస్ నడుపుతూవుంటుంది. ఈమెను తెలుగుతల్లిగా భావించాలి. అన్నపూర్ణ తన మెస్‌లో విద్యార్థులందరికీ తల్లిలా అన్నం వండిపెడ్తుంది. గురువులా అదుపులో పెడ్తుంది. చిత్తం చేంబ్లీ అందరినీ తన ఆధీనంలో వుంచుకునేందుకు బెదిరిస్తుంది. నాయకురాలుగా విద్యార్థులను "శక్తి సైన్యంగా" తయారుచేస్తుంది. వలుసరు అన్నదమ్ములు (రంపతిరావు, చలసాని, వంకాయల, వర్రా) సాదా విలన్లుగా తమ స్వార్థంకోసం నానాదురాగతాలు చేస్తుంటారు. అన్నపూర్ణ "శక్తిసైన్యం" తో ఈ దురాగతాలు ఎదిరించటం వగైరా జరిగిపోతుంది.

అన్నపూర్ణ పాత్రను సరిగా మలచనందువల్ల ఈ పాత్రను పోషించిన శారద నటనాప్రతిభ దెబ్బతిన్నది. లాయర్ గాండీరాజాపాత్ర కాస్త మెరుగ్గా కనిపిస్తుంది. ఇందులో పరుచూరి గోపాలకృష్ణ మాటలతో చురుగ్గాకనిపించారు. పరుచూరి వెంకటేశ్వరరావు, శివకృష్ణ, మురళీకృష్ణ, దగ్గుబాటిరాజా సమాజానికి పనికొచ్చేవాడుగా జాగానడించారు. అల్లూరి సీతారామరాజు గెటప్‌లో రంగనాథం తుపాకి పట్టి రేకెత్తించిన విప్లవం చప్పగావుంది. బ్రోకర్ సుబ్బారావు పాత్రలో మూర్తి నోటివెంట నెల్లూరు మాండలికం సరిగ్గా పలకలేదు. ఒక్కపాటా బాగులేదు. ఒకటి రెండు పాత్రలకుతప్ప మొత్తంమీద మాటలు బాగాలేవు. చక్రవర్తి సంగీతం చప్పగావుంది. ★

## విద్యార్థి సంఘాలు

(4వ పేజీ కొరవ)

ఆర్. రాము ఎన్నికోబడ్డారు.

కె. ఎ. సి. స్వతంత్రులు

కె. ఎ. సి. జూనియర్ కాలేజిలో ఇండిపెండెంట్లే చాలామటుకు నెగ్గారు. అధ్యక్షుడుగా ఎస్. కె. మస్తాన్, ఉపాధ్యక్షుడుగా ఓ. శ్రీరాములు, కార్యదర్శిగా ఎల్. మాలకొండయ్య, సంయుక్త కార్యదర్శిగా ఎల్. రమేష్, గేమ్స్ కార్యదర్శిగా ఎమ్. రాజశేఖర్, విద్యార్థినుల ప్రతినిధిగా డి. మాధవి ఎన్నికయ్యారు.

వేణుగోపాలస్వామిలో

తె. వి. ప. విజయం

వేణుగోపాలస్వామి కళాశాలలో నాలుగేళ్ళ తర్వాత ఎ. బి. వి. పి. ని మట్టికరపించి తెలుగు విద్యార్థి పరిషత్ విజయం సాధించింది. ప్రెసిడెంట్ వి. వి. సుబ్బారావు, వైస్ ప్రెసిడెంట్ ఎ. బి. జయభాస్కర్‌రాజు, సెక్రటరీ పి. వెంగయ్య, వైస్ అర్ట్స్ సెక్రటరీ కె. హెచ్. శివహరి ప్రసాద్‌రావు, మహిళాప్రతినిధి వి. పద్మావతి.

వి. వి. ఆర్. ఆర్. లో

ఎ. బి. వి. పి.

వి. వి. ఆర్. ఆర్. జూనియర్ కాలేజిలో ఎ. బి. వి. పి. వారు గెలిచారు. ప్రెసిడెంట్ కె. ప్రసాద్, వైస్ ప్రెసిడెంట్ కె. నాగేంద్రరావు, సెక్రటరీ ఆర్. శేషులు, జాయింట్ సెక్రటరీ యు. వెంకటకృష్ణ, సీనియర్ ఆర్ట్స్ రెప్రజెంటేటివ్ ఎ. నాగయ్య, సీనియర్ సైన్స్ రెప్రజెంటేటివ్ బి. కామేశ్వరప్రసాద్, జూనియర్ ఆర్ట్స్ రెప్రజెంటేటివ్ కె. శివపతి, జూనియర్ సైన్స్ రెప్రజెంటేటివ్ ఎం. కృష్ణప్రసాద్ ఎన్నికైనారు. ★

## మధురకవి

(4వ పేజీ కొరవ)

శోభితమై, హృద్యమై తనరారుచున్నాయి.

"కాంక్ష నవమాసములుమోసి కష్టమొంది
నిన్నుగని పెంచి పెద్దవానిగనొనర్చి
మమత లాలించి పాలించి మలచినట్టి
తల్లిఋణముసుదీర్ప నీతరమె వత్స?"

• • •

ఆకలికిదూల నీ వేడ్చినప్పుడెల్ల
మమ్మువను నిన్నుపైకెత్తి యక్కుజేర్చి
కడుపునిండగ స్తన్యంబు గుడిపినట్టి
తల్లిఋణమునుదీర్ప నీతరమె వత్స?

కృష్ణారావు అనుగుపుత్రుడు కామరాజు ఆరుసంవత్సరాల వయస్సులో మరణించారు. అపుడు శ్రీ రావు "పాపాయి" కావ్యాన్ని రచించారు. అందులో తన ఆవేదనను ఎంత విషాదభరితంగా వర్ణించారో చూడండి.

"ఏను సౌఖ్యంబునొందుట గానలేక
నీకు కరుగుట్టిగాటోలు గానయున్న
మూటగలుపుడునే పండువంటి సుతుని
వెనదికాలమ! నీకేమి చేటుమూడె?

• • •

"అకట! మురిపల్పులారనియట్టి నినుగు
వంత మొందింప నీ కక్కమయ్యెగాని
అట్టి మంగళకారుని అమంగళుని
మసుడబట్టింప నీ కక్కమగునె మిత్తి! ★

## సినిమా

(9వ పేజీ కొరవ)

18న సుమజాపిద చేసిన ఫిర్యాదులను బీనా, సునీత, షీల, లక్ష్మి ఉపసంహరించుకున్నారు. తత్ఫలితంగా సుమజాపై పోలీసులు పెట్టిన కేసులను సైదాపేట 9-వ మెట్రోపాలిటన్ మేజిస్ట్రేటు శ్రీ ఎన్. రాధాకృష్ణన్ కొట్టివేశారు. ఇక సుమజా సుప్రీమ్‌కోర్టులో దాఖలు చేసిన పిటిషన్‌ను వాపస్ తీసుకోవలసివుంది. దీనితో సుమజా ఇక బయటపడ్డట్లే.

కొనుగోలుదారులారా!

కళ్ళు తెరవండి

తక్కువ బడ్జెట్‌లో తీసిన కళ్ళు, బది, సగటుమనిషి, ఘర్షణ వగైరా చిత్రాలు కొనుగోలుదారులను ఆకర్షించలేకపోయినా బాక్సాఫీస్ దగ్గర విజయాన్ని సాధించి, కొనుగోలుదారుల అంచనాలను తలక్రిందులు చేశాయి. వీరిదృష్టి ఎప్పుడూ భారీగా తయారయ్యే మసాలా చిత్రాల పైనే. అలాంటి పెద్దచిత్రాలనుకొని ఒక్కోసారి విపరీతమైన నష్టాలనుసైతం ఎదుర్కొంటారేగాని తక్కువ బడ్జెట్‌లో తీసిన చక్కని చిత్రాల గురించి ససేమిరా పట్టించుకోరు. అందుకే మనకు ఉత్తమ చిత్రాలు కొరవడుతున్నాయి. ★

## పంచ పేర్లు

(9వ పేజీ కొరవ)

లలిత జగదాంబ ప్రొడక్షన్స్: అవనిలో అదితి, వి. ఎం. ఆర్. ఫిలిమ్స్: అరచేతిలో వైకుంఠం, అరచేతిలో స్వర్గం, శ్రీదేవి కళా చిత్ర: అంకితం, రత్నాకర మూవీ సర్క్యూట్: అగ్నివర్షం. శ్రీశ్రీ క్రియేషన్స్: అగ్నిపుత్రి. మంజు సినీ క్రియేషన్స్: అక్షయదీపం. ఎస్. కె. ఆర్ట్స్ ఆక్రోశం.

ఇతర ఏ భాషల్లోనూ ఇన్ని చిత్రాలు ఒకేపేరుతో రిజిస్టర్ అవలేదు. ★



### నెల్లూరు జిల్లాజడ్జి కోర్టులో
O. P. No- 355/88

బండి మాధవి, బండి శేఖర్ మైనర్ల తరుపున బండి రామచంద్రారెడ్డి-పిటిషనర్

Vs.

బండి మధుసూదనరెడ్డి -రెస్పాండెంట్

జనరల్ నోటీసు

పై నంబరు ఓ. పి. మైనర్లకు వారి ఆస్తికి పిటిషనర్‌ను గార్డియన్‌గా నియమించమని కోరుచూ పిటిషన్ దాఖలు చేసి వున్నందుకు ఎవరికైనా ఆక్షేపణలున్న యెడల 6-9-88 తేది పగలు 10గంలకు పై కోర్టులో హాజరై తెలుపు కోవలసింది. లేనియెడల సదరు విషయమై మీ పరోక్షమందు తీర్మానించబడును.

యస్. కె. యూసఫ్
పిటీషనరు అడ్వకేటు.

### నెల్లూరు ప్రి॥డి॥ము॥ కోర్టులో
O. S. No. 520 of1988

Velampalli Meenakshama -Plaintif

Vs

Peruri Mohan Rao -Defedant.

NOTICE

To,
Peruri Mohan Rao
Kotha Veedhi, S.H.Pet.,
NELLORE

పై నంబరు గల దావాలో ప్రతివాది నోటీసు నిమిత్తము 8-9-88 తేదికి వాయిదా వేయటమైనది. ఆరోజు ఉదయం 10గం॥లకు పై కోర్టులో స్వయముగా గాని లేక వకీలు ద్వారా గాని హాజరయి మీ ఆక్షేపణలు తెలుపుకోవలయును. లేనిచో మీ పరోక్షమున దావా తీర్మానము చేయబడును.

-బి. ఆదిశేషారెడ్డి
వాది అడ్వకేటు

### నెల్లూరుజిల్లా జడ్జికోర్టులో
O. P. No. 354/88

పెళ్ళకూరు సోబారాణి పెళ్ళకూరు సిరిషా మైనర్ల తరుపున పొన్నాల సుశీలమ్మ -పిటీషనరు

Vs

పెళ్ళకూరు వెంకట సుబ్బారెడ్డి -రెస్పాండెట్స్

జనరల్ నోటీసు

పై నంబరు ఓ. పి. మైనర్లకు వారి ఆస్తికి పిటిషనర్‌ను గార్డియన్‌గా నియమించమని కోరుచూ పిటిషన్ దాఖలు చేసి వున్నందుకు ఎవరికైనా ఆక్షేపణలున్న యెడల 6-9-88 తేది పగలు 10గం॥లకు పై కోర్టులో హాజరై తెలుపుకోవలసింది. లేనియెడల సదరు విషయమై మీ పరోక్షమందు తీర్మానించబడును.

యస్. కె. యూసఫ్
పిటీషనర్ అడ్వకేటు.

### జమీన్ రైతు చందా

| | |
|---|---|
| సంవత్సరం చందా | రూ. 50-00 |
| ఆరు నెలలకు | ,, 26-00 |

విడిప్రతి ఒక్కరూపాయి



### గుంటూరు డి॥ము॥ కోర్టులో
O. S. 869/84

I. A. 225/87

Central Bank of India -Petitioner

and

Syed Pakeer Saheb
S/o. Adam Saheb
యలవర్తిపాడు, గుంటూరు డి.యం.సి.
-Respondent

పై నంబరులో పిటిషనరు 1వ రెస్పాండెంటుపై ఫైనల్ డిక్రి పిటిషను దాఖలు చేయగా 1వ రెస్పాండెంటుకు పేపరు పబ్లికేషను నిమిత్తం 9-9-88 తేదికి వాయిదా వున్నది. సదరు వాయిదారోజు ఉదయం 10-30 గం॥కు హాజరై ఆక్షేపణలు తెలియపర్చుకోవలసినది. అలా హాజరుకానియెడల 1వ రెస్పాండెంటు పరోక్షమందు తీర్మానించబడును.

-ఎన్. రాయన్న పిటిషనరు తరఫు అడ్వొకేటు

### కోవూరు ప్రి॥డి॥ము॥ కోర్టులో
O. P. No. 20/88

గంగపట్నం వెంకయ్య -పిటిషనరు

Vs

Nil —రెస్పాండెంట్లు

జనరల్ నోటీసు

యిందుమూలముగా యావన్మందికి తెలియజేయడమేమనగా చనిపోయిన సత్యాం త్రిలోకసుందరిదేవికి, నెల్లూరుజిల్లాపరిషత్ నుండి రావలసి వున్న రిటైర్‌మెంట్ బెనిఫిట్స్ రు. 20,000/-లను తీసుకొనుటకు గాను తనకు సక్సేషను సర్టిఫికేటును యిప్పించమని పిటిషనరు పైపిటీషనును దాఖలుచేసివున్నందున, అందువిషయమై ఆక్షేపణలున్నవారు 6-9-88 తేది వుదయం 10 గం॥లకు పై కోర్టులో హాజరై ఆక్షేపణలు తెల్పుకోవలెను. లేనియెడల ఎక్సుపార్టీగా తీర్మానించబడును.

వాయిదా తేది 6-9-88

ఎస్.ఎల్.వి. రమణారెడ్డి - టి. శేషమ్మ,
పిటిషనరుతర్పు అడ్వకేట్లు.



మాకు మార్గదర్శి, మా అభివృద్ధికి కారకులు

# అనపల్లి వెంకురెడ్డిగారు

కోవూరు

17-8-88 తేది అందరిని దుఃఖసాగరమున ముంచి దివికేగినారు.

వారి ఆత్మకు చిరశాంతి కలుగజేయమని భగవంతుని ప్రార్థిస్తూ

అనపల్లి అన్నపూర్ణమ్మ-భార్య; అనపల్లి అశోక్‌కుమార్ రెడ్డి-కుమారుడు; సులోచనమ్మ-కోడలు;
పచ్చిపాల ప్రమీలమ్మ, పల్లంపర్తి ఇందిరమ్మ, పైరు సుజాతమ్మ-కుమార్తెలు
పచ్చిపాల వెంకురెడ్డి, పి. వి. కృష్ణారెడ్డి, BE.,ADE., Electricity-అల్లుళ్ళు

సదాశివ ఏజన్సీస్
వైన్ డిస్ట్రిబ్యూటర్సు. నెల్లూరు.

శ్రీ మురుగన్ ఏజన్సీస్
హోల్ సేల్ వైన్ మర్చంట్స్, నెల్లూరు.

మల్లికార్జున ఏజన్సీస్
హోల్ సేల్ వైన్ డీలర్లు
అనంతపూర్

రామలింగేశ్వర ఏజన్సీస్
వైన్ డిస్ట్రిబ్యూటర్స్
అనంతపూర్

మల్లికార్జున ఏజన్సీస్
వైన్ డిస్ట్రిబ్యూటర్సు
బళ్ళారి

---

ఉత్తరక్రియలు 31-8-88 తేది కోవూరులో వారి స్వగృహమున జరుగును. బంధుమిత్రులు తెలియగోరుతాము.